# వీక్షణం

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 4
జనవరి 1-15, 200[illegible]

సమతా పబ్లికేషన్స్ ప్రచురణ

పేజీలు : 24
వెల: రూ.6-00



లోపలి పేజీల్లో...



విడి ప్రతి : రూ॥ 6/-
వార్షిక చందా : రూ॥140/-లు

సంపాదకీయం:

## డాక్టర్ల సమ్మె - అసలు సమస్య అభిప్రాయాలది!

**నెల** రోజులకు పైగా రాష్ట్రంలో జూనియర్ డాక్టర్లు నిర్వహిస్తున్న సమ్మె, వాళ్ళ న్యాయమైన డిమాండ్ల పట్ల ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు రాష్ట్రంలో సాగుతున్న రాజకీయార్థిక పరిణామాలకు అద్దం పడుతూ ప్రజా జీవనానికి సంబంధించిన మౌలిక ప్రశ్నలెన్నింటినో లేవనెత్తుతుంది. కేవలం డబ్బులకు సీట్లమ్మే ప్రభుత్వ విధానాన్ని జూనియర్ డాక్టర్లు ప్రశ్నిస్తున్నారు. ప్రభుత్వాసుపత్రుల్లో ప్రజలకు ఉచితంగా అందవలసిన వైద్య, ఆరోగ్య సేవలకు యూజర్ ఛార్జీలను వసూలు చేయడాన్ని జూనియర్ డాక్టర్లు తప్పు పడుతున్నారు. ఇతరంగా వాళ్ళ డిమాండ్లనన్నిటినీ అటూఇటూగా ఒప్పుకోవడానికి సిద్ధపడిన ప్రభుత్వం, ఈ రెండు డిమాండ్ల విషయంలో మాత్రం ససేమిరా అంటున్నది. అంతేకాదు, అవి విధాన నిర్ణయాలనీ, వాటిని ప్రశ్నించే హక్కు డాక్టర్లకు లేదనీ కూడా అంటున్నది. అంటే ప్రజా జీవితానికి సంబంధించిన ముఖ్యమైన ప్రశ్నలను, ఆ జీవితాన్ని అల్లకల్లోలం చేయబోయే విధానాలకు సంబంధించిన ప్రశ్నలను, ఆ ప్రజలలోనే ఒక భాగమైన డాక్టర్లు వేయగూడదన్న మాట. గతంలో విద్యుత్ ఉద్యోగుల ఆందోళన సందర్భంలోనూ, ఆర్టీసీ ఉద్యోగుల ఆందోళన సందర్భంలోనూ కూడా ప్రభుత్వం ఇటువంటి వాదననే ముందుకు తెచ్చింది. సరిగ్గా ఆ విషయాలలోనే వాషింగ్టన్ నుంచి ప్రపంచబ్యాంకు ప్రభువుల ఆదేశాలను పాలిస్తున్న ప్రభుత్వం, ఆ విషయాలను స్థానిక ప్రజలలోని బృందాలు అడగడానికి వీలులేదని అంటున్నదంటే ఈ కుతర్కానికి ఏ పేరుపెట్టాలి? ప్రభుత్వం ఏ విషయంలోనైనా తాను తీసుకోబోయే విధానాల్ని ప్రజల్లో చర్చకు పెట్టకపోవడం ఒక తప్పయితే తన పరిపాలనకు ప్రజాస్వామ్య స్వభావాన్ని తనకు తానుగా ఆపాదించుకుంటున్న ప్రభుత్వం ప్రజల ఆశలు, అభిప్రాయాలు, ఆకాంక్షలకు వ్యతిరేకంగా విధానాలను రూపొందించి అమలుపరచడం రెండో తప్పు. అంతిమంగా ఆ విధానాల అమలుతో తలెత్తే ఫలితాలను అనుభవిస్తూ అవి సరైనవో, కాదో తేల్చి చెప్పే సహజమైన హక్కు లేదనడం అన్నింటికంటే పెద్ద తప్పు. నిజానికి డాక్టర్లు కేవలం తమ జీతభత్యాల, పని పరిస్థితుల, సౌకర్యాల డిమాండ్లు దాటి, ప్రజోపయోగకరమైన డిమాండ్లు పెట్టడం చాలా ఆహ్వానించదగిన అంశం. మొత్తంగా సమాజం వ్యాపారీకరణకు గురవుతూ వైద్య, ఆరోగ్య సేవలు సరుకులుగా, బంగారు గుడ్లు పెట్టే బాతులుగా మారిపోయి ఉన్నప్పుడు, జూనియర్ డాక్టర్లు తమ స్వార్థాన్ని, వ్యాపార దృష్టిని విడనాడి జనహితం గురించి ఆలోచిస్తున్నందుకు వారిని అభినందించవలసి ఉంది. అట్లా అభినందించే బదులు ఈ ప్రభుత్వం వారిని హాస్టళ్ళ నుంచి ఖాళీ చేయిస్తూ, వారి మీద అణచివేతను అమలుచేస్తూ, కక్షసాధింపు సాగిస్తూ ఉన్నదంటే ఈ ప్రభుత్వానికి జనహితం మీద ఎంత మాత్రం శ్రద్ధ లేదన్నమాట. డబ్బులు రాలితే చాలు ఎంత అక్రమమైనా సాగిస్తూ, ఆ అక్రమాలను ప్రశ్నించే వారి మీద గ్రుడ్లురిమి, చూపుడు వేలు ఎక్కుపెట్టదలచుకున్నదన్నమాట. నిజానికి వైద్యుల ప్రధాన డిమాండ్లను అంగీకరిస్తే రాష్ట్ర ఖజానాకు పెరిగే ఖర్చు కొన్ని వందల కోట్లకు మించదు. ప్రభుత్వం సాగిస్తున్న ప్రచార వ్యయాన్ని మించదు. కాని సమస్య నిధులది కాదు, భావజాలానిది. ప్రభుత్వం సంపన్న వర్గాలకు అనుకూలంగా ప్రజావ్యతిరేక భావజాలంతో నడుస్తోంది. డాక్టర్ల సమ్మె ప్రజానుకూల భావజాలంతో కొన్ని డిమాండ్లు పెట్టింది. అదీ అసలు సమస్య. ●

# సామాజికరంగాలకు, గ్రామీణాభివృద్ధికి కేంద్ర ప్రణాళికలో కేటాయింపులు

రు. కోట్లు

| | 1999-00 | | 2000-01 | | 2001-02 | | 2002-03 |
|---|---|---|---|---|---|---|---|
| | బ.అం | స.అం | బ.అం | స.అం | బ.అం | స.అం | బ.అం |
| 1. విద్య | 4700.0 | 4385.0 | 5449.0 | 4950.0 | 5920.0 | 5570.0 | 7025.0 |
| అందులో ప్రాథమిక విద్య | 3035.0 | 2852.0 | 3609.0 | 3150.0 | 3800.0 | 3574.8 | 4302.3 |
| వయోజనవిద్య | 110.0 | 79.0 | 120.0 | 100.0 | 200.0 | 175.3 | 209.7 |
| 2. ఆరోగ్యం (హోమియోపతి, దేశీయ వైద్య విధానాలు కలిపి) | 1195.0 | 1062.0 | 1378.0 | 1250.0 | 1553.0 | 1418.0 | 1643.5 |
| 3. కుటుంబ సంక్షేమం | 2920.0 | 3120.0 | 3520.0 | 3200.0 | 4210.0 | 3700.0 | 4930.0 |
| 4. స్త్రీలు, బాలబాలికల అభివృద్ధి. | 1320.0 | 1250.0 | 1460.0 | 1350.0 | 1650.0 | 1650.0 | 2200.0 |
| అందులో సమీకృత పిలల్ల అభివృద్ధి సేవలు | 856.0 | 856.0 | 935.0 | 935.0 | 1198.0 | 1217.6 | 51442.2 |
| 5. సంక్షేమం (సామాజిక న్యాయం, ఎంపవర్‌మెంటు) | 1207.0 | 1159.0 | 1350.0 | 1173.0 | 1333.0 | 1239.7 | 1410.0 |
| 6. గ్రామీణాభివృద్ధి, గ్రామీణ ఉద్యోగాలు దారిద్ర్యం తగ్గింపు | 9751.0 | 9351.0 | 9760.0 | 3290.0 | 9765.0@ | 11067.0@ | 11170.0@ |
| ఎ) జవహర్ గ్రామీణ సమృద్ధి యోజన | 2095.0 | 1689.0 | 1650.0 | 1494.0 | 1650.0 | 1875.0 | 2220.0 |
| బి) ఉద్యోగ హామీ పథకం | 1700.0 | 2040.0 | 1300.0 | 1600.0 | 1600.0 | 1875.0 | 2220.0 |
| సి) నేషనల్ సోషల్ అసిస్టెన్స్ ప్రోగ్రామ్ | 725.0 | 710.0 | 715.0 | 715.0 | 835.0 | 635.0 | - |
| డి) ఐ.ఆర్.డి.పి. (స్వర్ణజయంతి గ్రామ స్వరోజ్‌గార్ యోజన | 1251.0 | 950.0 | 1000.0 | 470.0 | 500.0 | 550.0 | 710.0 |
| ఇ) గ్రామీణ నీటిసరఫరా పారిశుధ్యం | 2020.0 | 1899.0 | 2100.0 | 2100.0 | 2160.0 | 2110.0 | 2400.0 |
| ఎఫ్) గ్రామీణ గృహనిర్మాణం (ఇందిరా ఆవాస్ యోజనతో సహా) | 1710.0 | 1659.0 | 1710.0 | 1656.0 | 1527.0 | 1991.0 | 1725.0 |
| 7. ఇతర కార్యక్రమాలు | | | | | | | |
| ఎ) ప్రధనమంత్రి రోజ్‌గార్ యోజన | 173.0 | 190.0 | 201.0 | 201.0 | 193.5 | 193.5 | 152.1 |
| బి) స్వర్ణజయంతి పహారీ రోజ్‌గార్ యోజన | 181.0 | 126.0 | 168.0 | 95.0 | 168.0 | 45.5 | 105.0 |
| ఎ) సామాజిక రంగాలకు కేంద్రప్రణాళిక మొత్తం కేటాయింపు | 21447.0 | 20643.0 | 23286.0 | 21489.0 | 24793.0 | 24883.7 | 28635.6 |
| బి) మొత్తం ప్రణాళిక ఖర్చు | 77000.0 | 79395.0 | 88100.0 | 86238.0 | 100100.0 | 99154.1 | 113500.0 |
| సి) 'బి'లో 'ఎ' శాతం | 27.9 | 26.0 | 26.4 | 25.0 | 25.0 | 25.1 | 25.2 |
| డి) ప్రస్తుత ధరల్లో జిడిపి (కో.రూ) | 1936925 | 1936925 | 2104298 | 2104298 | 2296049 | 2296049 | 2451038 |
| ఇ) 'డి'లో 'ఎ' శాతం | 1.1 | 1.1 | 1.1 | 1.0 | 1.1 | 1.1 | 1.2 |

బ.అం= బడ్జెట్ అంచనా; స.అం= సవరించిన అంచనా; మూలం: కేంద్ర ప్రభుత్వ ఎకానమీ సర్వే **2002-03**

# ప్రజాస్వామ్యానికి పోలీసు కాపలా!

నిల్చుంటే సెక్యూరిటీ, కూర్చొంటే సెక్యూరిటీ; కదిలితే సెక్యూరిటీ, మెదిలితే సెక్యూరిటీ. ప్రజలకు, నాయకులకు మధ్య సెక్యూరిటీ అనే అడ్డుగోడను నిర్మించారు పోలీసులు. శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు, మంత్రులు అందరూ సెక్యూరిటీకి ఎగబడుతున్నారు. కొంతమందికి గన్‌మెన్‌లు స్టేటస్ సింబల్; మరికొంతమందికి వారి వారి నియోజకవర్గాల్లో ఫాక్షనిస్టుల నుంచి సెక్యూరిటీ అవసరమైంది. మేం కొండంత అభివృద్ధిని సాధించేశాం, ప్రజలంతా మా వైపునే వున్నారు, రెండు వందల సీట్లు మావే అని ఛాతి విరుచుకొని తిరిగే మంత్రులందరికీ ఎవరి నుంచి సెక్యూరిటీ అవసరమైందో తెలియదు. వారి అభివృద్ధి కార్యక్రమాలతో ప్రజలంతా నిజంగా నిగడదన్ని హాయిగా గుర్రుతీస్తూ నిద్రపోతుంటే ఎవరి నుంచి సెక్యూరిటీ అవసరమొచ్చింది? అలిపిరి తర్వాత ముఖ్యమంత్రి సెక్యూరిటీకి హద్దూ పద్దూ లేకుండా పోయింది. ఇటీవల ముఖ్యమంత్రి ఏ వూరు టూర్ వెళ్ళినా మూడు వేల మంది వరకూ పోలీసు రక్షణ ఏర్పాటు జరుగుతోంది. ఈ మధ్య వాజ్‌పేయి ప్రధాని హైదరాబాద్ తిరిగి వెళుతున్న రోజున ఆయన విమానాశ్రయానికి మధ్యాహ్నం రెండుగంటల సమయంలో వెళ్ళాల్సి వుండగా, బేగంపేట విమానాశ్రయాన్ని దాటిన తర్వాత ఉన్న పోలీస్ లైన్స్ ప్రాంతంలో ఉదయం 10 గంటల నుంచే పోలీసు గస్తీ ప్రారంభమైంది. ఆటోలను ఎక్కడా నిలవనివ్వకుండా తరిమేస్తుండగా నేను చూచా. ఆ ప్రాంతంలోని ఒక పనిమీద వెళ్ళి వస్తుండగా ఆటోకోసం ఎదురు చూస్తుంటే, అపుడే ఆటోరిక్షా కనబడితే ఎక్కాను. డ్రైవరు బండబూతులు తిడుతున్నాడు. విచారిస్తే తన ఆటోను అక్కడ నిలబెట్టినందుకు 50 రూపాయలు ఫైన్ వేస్తే, బేరమాడి 20 రూపాయలను వదిలించుకొని వచ్చానని వివరించాడు. 10 గంటల నుంచి సెక్యూరిటీ ఎందుకు? ప్రధాని వెళ్ళే అరగంట లేదా గంట ముందు బందోబస్తు అంటే అర్థం చేసుకోవచ్చు. కాని 10 గంటల నుంచి ఎందుకో? ఇది అసౌకర్యం కలిగించడమే కాక పోలీసులకు జేబులు నింపుకొనే అవకాశం ఇచ్చినట్లయింది. అలాగే ముఖ్యమంత్రి జిల్లాలో ఒక బహిరంగ సభలో మాట్లాడుతుంటే ఎవరో మహిళ లేచి ఏదో అడుగుతుంటే ఆమెను పోలీసులు బలవంతంగా బయటకు గెంటివేసినట్లు పత్రికల్లో వార్త. ఎందుకీ మితిమీరిన సెక్యూరిటీ అంటే నక్సలైట్ల హింసాత్మక చర్యల నుంచి రక్షణ అంటారు. నక్సలైట్ల హింస కొత్తేమీ కాదు; 30 సంవత్సరాలుగా జరుగుతున్న విషయమే. కాని ఏ కాంగ్రెస్ మంత్రికీ లేదా ముఖ్యమంత్రికీ ఇంత రక్షణ అవసరం రాలేదే? ఇంత ప్రజారంజకంగా దేశాన్ని, రాష్ట్రాన్ని ముందుకు తీసుకొని పోతున్న ముఖ్యమంత్రి, ప్రధానమంత్రికి ఆ ప్రజల నుంచే రక్షణ కావాల్సి వచ్చిందంటే, వారు మాట్లాడుతున్న అభివృద్ధి శబ్దకాలుష్యం తప్ప, మరేమీ కాదని రుజువవుతుంది. సెక్యూరిటీ కోసం ప్రజల డబ్బు లక్షల్లో ఖర్చవుతుంది. కాబట్టి ప్రభుత్వాలు ప్రజలకు, ప్రజస్వామ్యానికి పోలీసు కాపలా ఏమిటో జవాబు చెప్పుకోవాల్సి వుంది.

★ ★ ★

ప్రభుత్వ విధానాలను ప్రశ్నించే హక్కు జూనియర్ డాక్టర్లకు లేదని ముఖ్యమంత్రి ప్రవచించటం ఒక ప్రజాస్వామ్య వ్యవస్థలో కాదు ఒక నియంత పరిపాలనలో మాత్రమే వినే మాట. ప్రజాస్వామ్యానికి ఇంతకన్నా ప్రమాదమైన పరిణామం మరొకటి వుండబోదు. ఆయన ప్రతిపక్షంలో కూర్చొన్నపుడు, ఈ మాటలు కాంగ్రెస్ మంత్రులు అని వుండి వుంటే ఆయన కథాకళి నృత్యం చేసి వుండేవారు. ప్రశ్నించే హక్కు వుండకూడదని అంటే ప్రతిపక్షం అనేదే వుండకూడదు. అంటే ప్రజాస్వామ్యానికి ప్రభుత్వం, ప్రతిపక్షం అనే రెండు కళ్ళలో ఓ కన్ను పీకేయడమే. దానిపేరే నియంతృత్వం. ఆయన పార్టీలో ఆయన నియంత కావచ్చు, ఏమైనా కావచ్చు కాని రాష్ట్రానికో శాసనసభ వుంది; వివిధ రాజకీయ పార్టీలున్నాయి. ప్రభుత్వంతో అంగీకరించే, విభేదించే బుద్ధిజీవులున్నారు. ప్రజలకు ప్రాతినిధ్యం పాలకపార్టీ గుత్తసొమ్మేమీ కాదు? వివిధ ప్రజాసంఘాలున్నాయి. ప్రభుత్వ విధానాలను ప్రశ్నించే హక్కు లేదంటే వాళ్ళందరూ నోళ్ళు కుట్టేసుకోవాలన్నమాట. ప్రభుత్వ విధానాలనే వారి విధానాలుగా విధిగా అంగీకరించాలన్నమాట. అలాంటపుడు శాసనసభలెందుకు? శాసన మండలిని రద్దు చేసినట్లే శాసనసభను రద్దు చేసేయవచ్చు. రాష్ట్రంలో తెలుగుదేశం తప్ప, మరే పార్టీ వుండకూడదు. నక్సల్స్‌తో పాటు ఈ పార్టీలన్నీ నిషేధించవచ్చు. బహుళ పార్టీ రాజకీయ వ్యవస్థ స్థానే, రెండు పార్టీల వ్యవస్థ ఏర్పడాలని అందరూ అంటుంటే, మన ముఖ్యమంత్రి ఆచరణలో ఒకే ఒక పార్టీ వుండాలనే వాదిస్తున్నారు. అలా అనడమే చంద్రబాబు ప్రత్యేకత. సోవియట్ యూనియన్‌లో ఏక పార్టీ నియంతృత్వం వుందని అది వున్నన్నాళ్ళూ ఆడిపోసుకున్నారు. అక్కడ డెమోక్రసీ లేదన్నారు. ఆ వ్యవస్థ ప్రపంచపటం నుంచి కనుమరుగైంది. ఇపుడు చంద్రబాబు ఆ వ్యవస్థకు పునర్జన్మ ప్రసాదిస్తానంటున్నారు. ఎందుకంటే ఇపుడు ఏకధృవ ప్రపంచం ఏర్పడి, ప్రపంచ దేశాలన్నీ అమెరికాకు, బహుళజాతి సంస్థలకు దాసోహం చేయాలని ఆ శక్తులు ఉవ్విళ్ళూరుతుంటే, ఆ రాజకీయ విధానానికి అమెరికా, బహుళజాతి సంస్థలకు వకాల్తా పుచ్చుకొని, ఏకపార్టీ పరిపాలన ప్రతిష్టిస్తానంటున్నారు. అబ్బే, నేనలా అనలేదు. జూనియర్ డాక్టర్లకు ప్రభుత్వ విధానాన్ని ప్రశ్నించే హక్కు లేదని అంటున్నానని ముఖ్యమంత్రి అంటున్నారా? ఇక్కడ ఆయన్నే ప్రశ్న అడగాలి. దేశంలో ఏ రాష్ట్రమైనా విదేశాలతో సంబంధాలు పెట్టుకోవటంగాని, రుణాలు తెచ్చుకోటంగాని, కేంద్ర ద్వారానే జరగాలనేది దేశం అంగీకరించిన విధానం. ఈ విధానాన్ని కాదని, రాష్ట్రాలు నేరుగా విదేశాల నుంచి రుణాలు తెచ్చుకొనే హక్కు వుండాలంటూ ప్రభుత్వ విధానాన్నే ప్రశ్నిస్తున్నారు. అంటే విధానాలను ప్రశ్నించే హక్కు తనకే వుండాలి కాని డాక్టర్లకు వుండకూడదని ఆయన ఉద్దేశ్యమా? మద్యపానం నిషేధించాలనేది రాష్ట్ర ప్రభుత్వ విధానం. దానిని ప్రశ్నించడమే కాదు, బెల్ట్ దుకాణాలకు పచ్చజెండా వూపటం ప్రభుత్వ విధానాన్నే తిరగదోడటం కాదా? ప్రశ్నించటం కాదా? ముఖ్యమంత్రి ప్రశ్నిస్తున్నది జూనియర్ డాక్టర్ల హక్కునే కాదు; వాక్స్వాతంత్రాన్నిచ్చిన రాజ్యాంగాన్నే అని ఆయన గమనిస్తే మంచిది. కాని పాపం ఏం చేస్తారు? ప్రపంచ బ్యాంకు ఒత్తిడి అలాంటిది. ●

# ప్రజారోగ్య పరిరక్షణే ధ్యేయంగా సాగుతున్న జూనియర్ డాక్టర్ల సమ్మె

-కె. గోవర్ధన్

**జూనియర్** డాక్టర్లు కొనసాగిస్తున్న సమ్మె రాష్ట్రంలో ఎన్నో విధాలుగా ప్రాముఖ్యతనూ, ప్రత్యేకతనూ సంతరించుకొన్నది. తెల్లకోటులేసుకొని చేతిలో స్టెతస్కోపు పట్టుకొని హడావిడిగా తిరుగాడే పిల్లడాక్టర్లు నెలరోజులు గడిచినా చెక్కు చెదరని విశ్వాసంతో పట్టుదలగా ఇంత 'జిజ్జు'కు దిగడమేమిటని సగటు మేధావులు సైతం ముక్కుమీద వేలేసుకొంటున్నారు. సాధారణంగా ఎవరైనా సమ్మె చేయడంలో తమ స్వార్థాన్నీ, శ్రేయస్సునే లక్ష్యంగా పెట్టుకుంటారు. కానీ నేటి జూనియర్ డాక్టర్లు దీనికి భిన్నంగా సమ్మె కట్టారు. వారు వారి సౌకర్యాల కోసమో, సదుపాయాల కోసమో కాకుండా, కేవలం ప్రజా శ్రేయస్సే లక్ష్యంగా సమ్మెకు దిగారు. ఇది నిజంగా అపూర్వమైన విషయం. గ్లోబలైజేషన్ పుణ్యమా అని ఎవరి బతుకు వాళ్ళు చూసుకొంటున్న నేటి 'స్వార్థపు' రోజుల్లో పేద ప్రజలకు వైద్యం అందుబాటులో వుండాలనుకోవడం, అందుకు అడ్డుగా నిలుస్తున్న యూజర్ ఛార్జీలను ఉపసంహరించుకోవాలని తెగేసి చెప్పడం ప్రతి ఒక్కరూ అభినందించాల్సిన సందర్భం.

గత రెండున్నర, మూడు దశాబ్దాల కాలం తర్వాత జూనియర్ డాక్టర్లు ప్రజాపక్షపాతులుగా వీధుల్లోకి రావడం నిజంగా రాష్ట్ర ప్రభుత్వానికి, దాని యంత్రాంగానికి అంతులేని కోపాన్ని తెప్పిస్తున్నది. తమకు కావాల్సిన విషయాలపై మాట్లాడాలేగాని, వారికి సంబంధంలేని విషయాలపై సమ్మెకు దిగడమేమిటని అమాత్యులు చంద్రబాబు, కోడెల శివప్రసాద్‌లు కోపంతో ఊగిపోతున్నారు. యూజర్ ఛార్జీలు వద్దనడానికీ, ప్రయివేట్ మెడికల్ కాలేజీలు వద్దనడానికి జూనియర్ డాక్టర్లెవరని గుడ్లురిమి చూస్తున్నారు. ప్రభుత్వ విధానాల్ని ప్రశ్నిస్తారా అంటూ పళ్ళు పటపట కొరుకుతున్నారు. విధానపరమైన విషయాలపై పట్టువీడనంతకాలం వారితో చర్చించే ప్రసక్తే లేదని తెగేసి చెప్తున్నారు. మర్యాదగా సమ్మె మానకపోతే హాస్టళ్ళ నుండి ఖాళీ చేయిస్తామని చెప్పడమే కాకుండా, దాన్ని అమల్లోకి సైతం తీసుకొచ్చారు. అత్యంత శాంతియుతంగా, ప్రజాస్వామిక పద్ధతుల్లో సమ్మె చేస్తున్న వారి పట్ల ప్రభుత్వం నిరంకుశంగా వ్యవహరిస్తున్నది. ఒకవైపు నిర్బంధపూరిత అణచివేత చర్యలకొడిగడుతూనే మరోవైపు 11 వేల జూనియర్ డాక్టర్ల సమ్మెపై ప్రజల్ని రెచ్చగొట్టే విధానాల కొడిగడుతున్నది.

## జూనియర్ డాక్టర్లు కోరుతున్నదేమిటి ?

జూనియర్ డాక్టర్లు మొత్తం 16 డిమాండ్లపై సమ్మెకు దిగారు. ప్రభుత్వం ఆరోపిస్తున్నట్లుగా ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని రాజకీయ దురుద్దేశంతో ఈ సమ్మెను అకస్మాత్తుగా నేడు చేపట్టలేదు. 2001 సంవత్సరంలో ఇవే డిమాండ్లపై సమ్మె చేశారు. అప్పుడు ప్రభుత్వం రాతపూర్వకంగా 12 డిమాండ్లను అంగీకరించింది. ఇందులో ఏ ఒక్కదాన్ని అమలు చేయని కారణంగానే ఎదురు చూసి చూసి సమ్మెకు దిగుతామని గత సంవత్సరం ఏప్రిల్ నెలలోనే ప్రభుత్వానికి స్పష్టం చేశారు. ఆనాటి నుండి సమ్మె ప్రారంభమైన 2003 డిసెంబర్ 12 దాకా అనేక పర్యాయాలు రాష్ట్ర ప్రభుత్వానికీ, గవర్నర్‌కూ తమ కోర్కెల గురించి నిరంతరంగా మొరపెట్టుకొన్నారు. అంతేగానీ చంద్రబాబు ఆరోపిస్తున్నట్లుగా ఈ సమ్మె దురుద్దేశంతో తలపెట్టింది ఎంత మాత్రం కానే కాదని గ్రహించాలి నేడు జూనియర్ డాక్టర్లు కోరుతున్న కోర్కెల్లో వైద్య, ఆరోగ్య రంగాల్లో ప్రయివేటీకరణను నిలుపుదల చేయాలనే కింది డిమాండ్లే కీలకమైనవిగా ఉన్నాయి అవి :

- పేద, సామాన్య ప్రజలకు వైద్య సేవలను అందుబాటులోకి తేవాలి.
- ప్రభుత్వ ఆసుపత్రుల్లో యూజర్ ఛార్జీలను రద్దు చేయాలి.
- ప్రభుత్వ వైద్య, ఆరోగ్య రంగాలను ప్రయివేటీకరించవద్దు.
- ప్రయివేట్ రంగంలో గాకుండా ప్రభుత్వ రంగంలోనే వైద్య కళాశాలలను స్థాపించాలి.
- వైద్య, ఆరోగ్య రంగాల ప్రయివేటీకరణకు శాశ్వత ఉద్యోగ అవకాశాలను సమాధి చేసే జి.ఓ.90ని ఉపసంహరించుకోవాలి.
- పేద, మధ్య తరగతి విద్యార్థులను వైద్య విద్యకు దూరం చేసే సెల్ఫ్ ఫైనాన్సింగ్ సీట్ల విధానాన్ని రద్దు చేయాలి.

ఈ పై కోర్కెలేవీ అసంబద్ధమైనవీ, అన్యాయమైనంత మాత్రం కాకపోగా, అత్యంత న్యాయ సమ్మతమైనవీ, ప్రజా శ్రేయస్సును కాంక్షించేవి మాత్రమే. కానీ, రాష్ట్ర హైటెక్ పాలకులకు మాత్రం జూనియర్ డాక్టర్ల కోర్కెలన్నీ కొరకరాని కొయ్యలుగా కనిపిస్తున్నాయి. అంతేకాకుండా ఈ కోర్కెలన్నీ అభివృద్ధిని అడ్డుకొంటాయని కూడా ఏలికలు అదేపనిగా సెలవిస్తున్నారు. చక్కగా చదువుకొని డాక్టరై సొంత క్లినిక్కుల్లో, నర్సింగ్‌హోమ్‌లో పెట్టుకొని లేకపోతే కార్పొరేట్ హాస్పిటళ్ళలో చేరి లక్షల రూపాయల్ని మూడొందల అరవై ఐదు రోజులూ రెండు చేతులా ఆర్జించకుండా, యూజర్ ఛార్జీలొద్దని, పేదలకు వైద్యం దక్కాలని సమ్మె కట్టడమేమిటని జూనియర్ డాక్టర్లని తిట్టిపోస్తున్నారు. ఇంతటితో సరిపెట్టడం సైతం ఇష్టం లేక "ఈ సమ్మె రాజకీయ దురుద్దేశంతోనే తలపెట్టి, కొనసాగిస్తున్నా"రంటూ దుష్ప్రచారాన్ని

ముమ్మరం చేశారు. ఈ సమ్మె వెనుక నక్సలైట్లున్నారని ఒకసారి, ప్రతిపక్ష పార్టీలున్నాయని మరోసారి తమకు తోచిన రీతిలో అసత్య ప్రచారాన్ని ఎడతెగకుండా కొనసాగిస్తున్నారు. తద్వారాప్రజలను గందరగోళ పరచడానికి చేయాల్సినంత కంగాళీ ప్రచారాన్ని చేస్తున్నరు తప్పితే, సమ్మెను పరిష్కరించాలనే వైపుగా ఎంతమాత్రమూ ప్రయత్నించడం లేదు.

ప్రభుత్వ విధానాల్ని ప్రశ్నించడమా అనే నిరంకుశత్వంతో పాలకులు వ్యవహరిస్తూ, చారిత్రాత్మకంగా నిలిచిన సమ్మెపై నిర్బంధపు సమ్మెట పోటులకు సిద్ధపడుతున్నారు. విధానాలపై మాట్లాడే హక్కు జూనియర్ డాక్టర్లకు లేదనడంలోనే ప్రభుత్వపు నయవంచన విధానాన్ని అర్థం చేసుకోవచ్చు. నిజానికి ప్రజలకు వైద్యం అందుబాటులో లేక ఇబ్బందులకి గురి చేసే విధానాల్ని రూపొందించే హక్కు ఈ రాష్ట్ర ప్రభుత్వానికి, దానిని నడిపిస్తున్న ప్రపంచ కాబూలీవాలా అయిన ప్రపంచ బ్యాంకుకూ లేనే లేదు.

ప్రజాస్వామ్య వ్యవస్థలో ఏ విధానమైనా ప్రజలందరి క్షేమం, సంక్షేమం కోరేదిగానే ఉండాల్సుంటుంది. అందుకు భిన్నంగా ఉంటే దాన్ని వ్యతిరేకించే హక్కు, దాన్ని మార్చే విధంగానూ ఒత్తిడి తీసుకొచ్చే హక్కు ప్రతి ఒక్కరికీ ఉంటుంది. భారత రాజ్యాంగం సైతం అభిప్రాయ వ్యక్తీకరణను హక్కుగా గుర్తించిన విషయాన్ని పాలకులు మర్చిపోయి "విధానపరమైన" విషయాలను ప్రశ్నించే హక్కు జూనియర్ డాక్టర్లకు లేదంటున్నారు. జూనియర్ డాక్టర్లూ సమాజంలోని పౌరులేననీ, వారికీ ప్రజలకున్నట్లే భావ వ్యక్తీకరణ హక్కూ, మంచి చెడులను బేరీజు వేసుకొనే విచక్షణా, విజ్ఞతలుంటాయనే ప్రాథమిక విషయాల్ని సైతం పాలకులు పక్కన బెట్టి హూంకరిస్తున్నారు. నిజానికి 'విధానం' పేరిట నేడు రాష్ట్ర ప్రభుత్వం ముందుకు తెస్తున్న వైద్యరంగ ప్రయివేటీకరణే ప్రజల ఆరోగ్య హక్కును హరించి వేస్తున్నదని గమనించాలి. ప్రజలకు ఆరోగ్యాన్నీ, వైద్యాన్నీ అందజేయాల్సిన బాధ్యత నుండి ప్రభుత్వం వైదొలగడం ఏ రకంగానూ క్షేమకరం కాదని జూనియర్ డాక్టర్లు కోరుతుంటే వారిని విధానాన్ని ప్రశ్నిస్తారా అంటూ బెదిరింపులకు గురి చేయడం ప్రభుత్వ నిరంకుశత్వానికి నిదర్శనం. ప్రజల ఆరోగ్యానికి పూచీ పడాల్సిన ప్రభుత్వం, అందుకు పూనుకోని ఫలితంగానే ఆరోగ్య సేవలు ఖరీదై పోయి పేదలు కనీసం వైద్యాన్ని సైతం నోచుకోలేకపోతున్నారు. అందుకే ప్రొ॥ హరగోపాల్ "ఆరోగ్యం సరుకు కాదని, అది ఒక సేవా భావమని గుర్తించాలి" అంటున్నారు.

### ప్రభుత్వ వైద్యానికీ ప్రపంచ బ్యాంక్ 'షాక్ ట్రీట్‌మెంట్'

ప్రభుత్వ విధానాల్లో 1991లో చోటు చేసుకున్న "వ్యవస్థాగత సర్దుబాటు కార్యక్రమం" అన్ని రంగాల్లో 'సరళీకరణ' విధానాల పేరిట ప్రయివేటీకరణను వేగవంతం చేసింది. ప్రపంచ బ్యాంకు ఆదేశిత విధాలను తలకెత్తుకొన్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అన్ని రంగాల్లో మార్కెట్ శక్తుల పాత్రను ప్రోత్సాహించే ఆయా విధానాలకు 'సంస్కరణలనే' ముద్దు పేరును తగిలించాయి. ఇతర రంగాలలో లాగానే వైద్య,ఆరోగ్య రంగాల్లో సైతం ప్రయివేటీకరణ విధానాలు ఊపందుకున్నాయి. ఆరోగ్యం, వైద్యాన్ని మార్కెట్ సరుకుగా భావించిన పాలకులు క్రమంగా వీటికి బడ్జెట్ కేటాయింపుల్లో కోతను విధించడం ప్రారంభించాయి. సంక్షేమ రంగాలకు సబ్సిడీల్ని రద్దు చేయాలనే ప్రపంచ బ్యాంకు షరతుల కనుగుణంగానే 1996 నుండి ఈ రంగాలకు బడ్జెట్ కోత మెదలైంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ సూచించిన దాని ప్రకారం, ఏ దేశమైనా తన జి.డి.పి లో 5 శాతం వైద్య ఆరోగ్య సేవలకు కేటాయించాలి. కానీ మన ప్రభుత్వాలు ఒక్కటంటే ఒక్క శాతాన్ని కూడా కేటాయించడం లేదు. కేంద్ర ప్రభుత్వం 1951- 56 మధ్య కాలంలో 3.33 శాతం కేటాయించగా, 1997-2000 మధ్యకాలంలో కేవలం 0.5 శాతం మాత్రమే కేటాయించింది. రాష్ట్రప్రభుత్వం 1995-96 బడ్జెట్‌లో 13.74 కేటాయించగా, 1997-98లో 5.92 శాతం నిధుల్నిమాత్రమే కేటాయించింది. ఈ కేటాయింపుల్లో మూడొంతులు సిబ్బంది జీతభత్యాలకే సరిపోతుంటే, ఆ మిగిలే కొద్దిపాటి నిధులనే ఆరోగ్య సేవలకు వెచ్చించాల్సి వస్తున్నది.

ప్రపంచ బ్యాంకు ఆధ్వర్యంలోని "ఆంధ్రప్రదేశ్ ఎకనామిక్ రీస్ట్రక్చరింగ్ ప్రాజెక్టు" రాష్ట్రంలోని వైద్య ఆరోగ్య రంగాలపై కూడా తన దృష్టిని కేంద్రీకరించింది. అంతకుముందే ఆంధ్రప్రదేశ్ వైద్య విధాన

**స్థూల రాష్ట్ర ఉత్పత్తిలో ప్రభుత్వ వ్యయం వాటా (శాతం)**

| సంవత్సరం | ఆరోగ్య సేవలు | సామాజిక సేవలు | ఆర్థిక సేవలు | మొత్తం వ్యయం |
|---|---|---|---|---|
| 5వ పంచవర్ష ప్రణాళిక (1974-79) | 1.09 | 5.7 | 7.2 | 16.8 |
| 1979-80 | 1.20 | 7.3 | 8.7 | 20.5 |
| 6వ పంచవర్ష ప్రణాళిక (1980-85) | 1.25 | 8.1 | 7.6 | 20.2 |
| 7వ పంచవర్ష ప్రణాళిక (1985-90) | 1.29 | 8.5 | 8.5 | 22.3 |
| 1990-91 | 1.06 | 6.9 | 7.2 | 19.1 |
| 1991-92 | 1.00 | 6.5 | 6.9 | 18.4 |
| 8వ పంచవర్ష ప్రణాళిక (1992-97) | 0.94 | 6.3 | 6.9 | 18.2 |
| 1997-98 | 0.99 | 6.5 | 6.9 | 18.2 |
| 1998-99 | 1.00 | 6.9 | 5.2 | 17.6 |
| 1999-2000 | 1.04 | 6.7 | 5.0 | 17.9 |
| 2000-01 | 1.03 | 6.7 | 7.0 | 20.7 |

పరిషత్ పరిధిలోని ద్వితీయ శ్రేణి ఆసుపత్రుల్లో సంస్కరణల కోసం ప్రపంచ బ్యాంకు సహాయంతో ఎ.పి. ఫస్టు రిఫరల్ హెల్త్ సిస్టమ్ ప్రాజెక్టు" ను ఆరంభించింది. ఈ ప్రాజెక్టు ప్రభుత్వాసుపత్రుల్లో రోగుల వద్దనుండి వినియోగఛార్జీలను వసూలు చేయాలనీ, ఆసుపత్రి నిర్వహణలో కాంట్రాక్టు పద్ధతిని ప్రవేశ పెట్టాలని సూచించింది. (ఈ ప్రాజెక్టు ఆరోగ్య రంగంలో దేశంలోనే మొట్టమొదటి ప్రపంచ బ్యాంకు పథకం) దానికనుగుణంగానే ప్రభుత్వ, వైద్య ఆరోగ్య రంగాలను సొసైటీలకు అప్పగించి క్రమంగా ఆ బాధ్యతల నుండి వైదొలగడానికి వీలుగా రాష్ట్ర ప్రభుత్వం 2003, ఏప్రిల్ 17న జీవో 90ని జారీ చేసింది. ఇంతకుముందే అంటే 1998లో జివో 151ని ప్రభుత్వం జారీ చేసి యూజర్ ఛార్జీల వసూలుకు దిగింది. దీనివలన ప్రభుత్వ ఆసుపత్రులలో 15 నుండి 20 శాతం ఫీజులు వసూలు చేస్తున్నారు. 20 శాతం ఫీజులను కట్టగలిగే వారికే బెడ్స్‌ను కేటాయిస్తున్నారు. డాక్టర్ల, కాంపౌండర్ల, ఇతర సిబ్బంది నియామకమంతా కాంట్రాక్టు పద్ధతిలోనే కొనసాగుతున్నది. జివో 151కి కొనసాగింపుగా ముందుకొచ్చిన జివో 90 వైద్య ఆరోగ్య సేవల్ని పూర్తి స్థాయిలో ప్రయివేటీకరించడానికుద్దేశించినదే. ఇది ఉచిత వైద్య సేవలనూ, సిబ్బంది నియామకాన్ని శాశ్వతంగా సమాధి చేస్తుంది.

### ప్రభుత్వ వైద్యానికి సమాధి కట్టే జివో 90

జీవో 90 ప్రకారం వైద్య, ఆరోగ్య మరియు కుటుంబ సంక్షేమ నియంత్రణలోకి వచ్చే అన్ని మెడికల్ కాలేజీలు, ఆసుపత్రులు, ఆరోగ్య సంస్థలు "ఆంధ్రప్రదేశ్ సొసైటీ రిజిస్ట్రేషన్ యాక్ట్-2001" కింద రిజిస్టర్ చేయాలి. ఈ సొసైటీలే ఆయా ఆసుపత్రులకు అయ్యే ఖర్చులకుగాను నిధులను సేకరించి వినియోగించడం వంటి విధులను నిర్వహిస్తాయి. సూటిగా చెప్పాలంటే మొత్తం ఆసుపత్రుల నిర్వహణా కార్యక్రమమంతా ఈ సొసైటీలే చేబడతాయి. మౌలిక వసతులు, అత్యవసర సేవల వంటివి కూడా సొసైటీలే చేపట్టాలి. ప్రభుత్వమే అన్ని రకాలుగా బడ్జెట్‌లను కేటాయిస్తున్నప్పుడు అంతంతమాత్రంగా ఉంటూ వస్తున్న ప్రభుత్వాసుపత్రుల సేవలు సంక్షేమ దృక్పథం లేని సొసైటీల ఆధ్వర్యంలో ఎలా ఉంటాయో అర్థం చేసుకోవచ్చు. సంక్షేమం స్థానంలో లాభాపేక్ష చోటు చేసుకోవడం వల్ల వైద్య, ఆరోగ్య సేవలు ఖరీదైపోయి పేదలకు అందుబాటులో ఉండనే ఉండవు.

ఇప్పటికే దేశంలో, రాష్ట్రంలో ప్రభుత్వాసుపత్రులకు సమాంతరంగా శరవేగంగా విస్తరిస్తున్న ప్రయివేట్, కార్పొరేట్ ఆసుపత్రులు పేదలకు అంటరానివిగానే ఉంటున్నాయి. ప్రభుత్వాసుపత్రుల్లో వైద్యం చేయించుకునే పేదలు, దిగువ మధ్య తరగతితో సహా సాధారణ ప్రజానీకం యూజర్ ఛార్జీల ప్రవేశం ద్వారా నానా యాతనలకు గురవుతున్నారు. సమాజంలోని అత్యధిక పేద ప్రజానీకానికి - ఎన్ని లోటుపాట్లున్నప్పటికీ - ఈ నాటికీ ప్రభుత్వాసుపత్రులే వైద్య సేవలను అందజేస్తున్నాయి. ప్రపంచ బ్యాంకు ఆదేశిత విధానాల్లో భాగంగా వచ్చిన జీవో 90 ప్రభుత్వాసుపత్రుల్ని ప్రయివేటీకరించి, వాటిని పేదలకు దూరం చేస్తున్నందునే అది కూడదని నేడు జూనియర్ డాక్టర్లు పట్టుపడుతున్నారు. ప్రభుత్వం వైద్య రంగానికి ప్రపంచ బ్యాంక్ షాక్ ట్రీట్‌మెంట్ ఇవ్వడాన్ని అంగీకరించలేకనే తెగించి జూనియర్ డాక్టర్లు సమ్మెను సాహసించి సాగిస్తున్నారు.

### పేదలపై యూజర్ ఛార్జీలా ?

పేదవాడి సంక్షేమమే ప్రభుత్వ ధ్యేయమని ఎప్పుడూ ఊదరగొట్టే చంద్రబాబు ప్రభుత్వం పేదల నుండి యూజర్ ఛార్జీలను వసూలు చేస్తున్నది. జీవో 151 ప్రకారం 1998 నుండే అన్ని ప్రభుత్వ ఆసుపత్రుల్లో యూజర్ ఛార్జీలను వసూలు చేస్తున్నారు. మొత్తం 13 విభాగాలలో 312 రకాల పరీక్షలకు గాను ఒక రూపాయి నుండి 10 వేల రూపాయల దాకా పేదల గోళ్ళూడగొట్టి యూజర్ ఛార్జీలను వసూలు చేస్తున్నారు. హోంవార్డు ఛార్జీల కింద ఒక రోజుకు రూము ఛార్జీ రు.100, మేజర్ ఆపరేషన్‌కు రు.3,000, మైనర్ ఆపరేషన్‌కు రు.1000 వసూలు చేస్తున్నారు. మొత్తం యూజర్ ఛార్జీల కింద ప్రతి ఏటా రు.40 లేదా 50 కోట్ల రూపాయల్ని వసూలు చేయాలని లక్ష్యంగా పెట్టుకున్నారు.

**యూజర్ ఛార్జీలు (అమల్లో వున్నవి)**

| వైద్య విభాగం | మొత్తం టెస్టుల రకాలు | కనీస యూజర్ ఛార్జీలు (రూ.లు) | గరిష్ట యూజర్ ఛార్జీలు (రూ.లు) |
|---|---|---|---|
| బయోకెమిస్ట్రీ | 32 | 15 | 150 |
| కార్డియాలజీ | 16 | 5 | 10,000 |
| డెర్మిటాలజీ | 17 | 1 | 245 |
| ఎండాక్రైనాలజీ | 14 | 20 | 300 |
| ఫోరెనిక్స్ మెడిసిన్ అండ్ టాక్సికాలజీ | 51 | 10 | 500 |
| గ్యాస్ట్రో ఎంటరాలజీ | 10 | 10 | 283 |
| మైక్రో బయాలజీ | 2 | 100 | 200 |
| న్యూరాలజీ | 46 | 10 | 150 |
| పాథాలజీ | 21 | 229 | 3500 |
| ప్లాస్టిక్ సర్జరీ | 10 | 10 | 254 |
| సెక్సువల్ ట్రాన్స్‌మిటెడ్ డిసిజెస్ (ఎస్‌టిడి) | 5 | 500 | 2000 |
| సర్జరీస్ | 34 | 10 | 2000 |
| నెఫ్రాలజి | 34 | 10 | 2,000 |

## ప్రయివేట్ వైద్యానికే పెద్దపీట

చదివిస్తే ఉన్నమతి పోయిందన్నట్లుగా నేడు ప్రభుత్వాలు వైద్యాన్ని ప్రభుత్వం ఆధ్వర్యంలో లేకుండా చేసి ప్రయివేట్ రంగానికి అప్పగిస్తున్నాయి. దీనివల్ల డబ్బున్న మారాజులూ సంపన్నులూ మాత్రమే వైద్యం చేయించుకోగలుగుతున్నారు. కోటాను కోట్ల మంది రెక్కాడితే తప్ప డొక్కాడని నిరుపేదలు, సాధారణ ప్రజానీకం వైద్యం అందుబాటులో లేకుండా నానా యాతనలకు గురవుతున్నారు. ప్రస్తుతం రాష్ట్రంలో 1335 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు (పిహెచ్‌సి) ఉన్నాయి. వీటిలో మౌలిక వసతులు, సదుపాయాలు మృగ్యం అయినందున పేదలు వైద్యం కోసం అష్టకష్టాలు పడి జిల్లా కేంద్రానికో రాష్ట్ర కేంద్రానికో వెళ్ళాల్సి వస్తున్నది. దూరాభారం, వ్యయ ప్రయాసలతో కూడినందున చాలామంది పేదలు శక్తికి మించినదైనప్పటికీ స్థానికంగా అందుబాటులో గల ప్రయివేట్ ఆసుపత్రులనే నమ్ముకోవాల్సి వస్తున్నది. ప్రభుత్వాల నిరర్థక విధానాల ఫలితంగా ప్రభుత్వాసుపత్రులు సరిగా పని చేయలేని స్థితిని ప్రయివేట్ ఆసుపత్రులు చక్కగా వినియోగించుకొని ప్రతిరోగి దగ్గరా వందల, వేల రూపాయల్ని రకరకాల పేర్లతో గుంజుతున్నాయి.

## కార్పొరేట్ వైద్యం కాసులున్న వారికే!

ప్రయివేట్ వైద్యరంగంలో నేడు కార్పొరేట్ ఆసుపత్రులు గుత్తాధిపత్యాన్ని వహిస్తున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాలను ఈ తరహా ఆసుపత్రులు పూర్తి స్థాయిలో వినియోగించుకొని కోట్లకు పడగలెత్తుతున్నాయి. 1985లో రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నగరంలో స్థాపించిన మెడినోవా ఆసుపత్రితో ప్రారంభమైన కార్పొరేట్ వైద్యం నేడు ఆరోగ్య రంగాన్నే శాసించే స్థాయికి చేరుకున్నది. అనతి కాలంలో ఈ రంగం ఈ స్థితికి చేరుకోవడానికి పాలకుల ప్రోత్సాహం, అండదండలే కారణంగా వున్నాయి. కార్పొరేట్ ఆసుపత్రులకు పన్ను రాయితీలు, ఉచిత లేదా నామమాత్రపు రేట్లకే భూమి కేటాయింపు తదితర సబ్సిడీల్ని ప్రభుత్వాలు కల్పిస్తున్నాయి. 1989లో ప్రవాస భారతీయులు ఇదే హైదరాబాద్‌కు రాగా, నగరంలో 30 ఎకరాల భూమిని అపోలో ఆసుపత్రికి రాష్ట్ర ప్రభుత్వం సమకూరిస్తే, కేంద్ర ప్రభుత్వం పరికరాల దిగుమతిపై పన్ను రాయితీల్ని కల్పించింది. హైదరాబాద్‌లో నేడు 6, 7 కార్పొరేట్ స్థాయి ఆసుపత్రులున్నాయి. ఇవి శాఖోపశాఖలుగా దేశంలోనూ, విదేశాల్లోనూ విస్తరించే దిశగా సాగిపోతున్నాయి. వేల కోట్ల రూపాయల వ్యాపారం వీటిలో సాగుతున్నది. పేదలకు ఉచితంగా వైద్య సేవల్ని అందజేస్తామని ప్రభుత్వ రాయితీలు పొందుతున్న ఈ ఆసుపత్రులేవీ ఆ విధంగా వ్యవహరించడం లేదు. ఈ ఆసుపత్రుల నిర్వహణపై నేటికీ ప్రభుత్వాలకు నియంత్రణ లేదు.

ఒకవైపున కార్పొరేట్, ప్రయివేట్ రంగంలో వైద్యం మూడు పువ్వులూ ఆరుకాయలుగా వర్ధిల్లుతుంటే మరోవైపు లక్షలాది, కోట్లాది మంది ఆధారపడే ప్రభుత్వానువత్రుల్లో వైద్యం నానిదై దిగజారిపోతున్నది. ప్రభుత్వం తన అభివృద్ధి నిరోధక విధానాలు మానుకోకుండా ఇపుడు ప్రభుత్వాసుపత్రుల్ని మెరుగుపరిచే పేరిట, నిధుల్ని సమకూర్చుకునే పేరిట యూజర్ ఛార్జీలు వసూలు తప్పదంటున్నది. కొనుగోలు శక్తి లేని పేదలు ఈ ఛార్జీలు చెల్లించలేని స్థితిలో వైద్యానికి దూరం చేయబడుతున్నారు. ఉదాహరణకు, ఉస్మానియా ఆసుపత్రిలోని పేయింగ్ వార్డుల్లోని పడకల్లో 35 శాతం మాత్రమే ఉపయోగించుకోబడుతున్నాయి. యూజర్ ఛార్జీలు లేకముందు ఇవే పడకలకు వెయిటింగ్ లిస్టులుండేవి.

## వైద్య ఆరోగ్య రంగాలు ప్రభుత్వరంగంలోనే ఉండాలి!

ఆరోగ్య సంస్కరణలు ప్రపంచ బ్యాంకు మార్గదర్శకత్వంలో కొనసాగినంత కాలం పేదలకు, సాధారణ ప్రజలకు వైద్యం ఎండమావి లాంటిదేనని ఎన్నో దేశాల అనుభవాలు ఇప్పటికే రుజువు చేశాయి. దేశంలో, రాష్ట్రంలో ఇప్పటికే అమలవుతున్న వైద్యరంగంతో సహా అనేక రంగాల అనుభవాలు మన కళ్ళముందున్నాయి. ధర్మాసుపత్రులు పోయి ధనాసుపత్రులు వెలుస్తూనే వున్నాయి. 'సిరి'గలవాడే 'సిరంజి' పట్టుకోగలుగుతున్నాడు. వైద్యవిద్యనూ, వైద్యాన్నీ మార్కెట్ సరుకుగా మారుస్తున్న పాలకుల విధానాల్ని తిప్పి కొట్టాలి. ఆ క్రమంలో గత నెల రోజులకు పైగా చారిత్రాత్మకంగా సమ్మె కొనసాగిస్తున్న జూనియర్ డాక్టర్లకు సమాజంలోని అన్ని వర్గాల ప్రజలు అండదండలందివ్వాలి. వైద్య, ఆరోగ్య రంగాల ప్రయివేటీకరణకూ వ్యతిరేకంగా కొనసాగుతున్న ఈ ఉద్యమం విజయవంతం కావడం ద్వారానే సమాజ పురోగతికి పునాదిరాళ్ళుగా నిలుస్తున్న పేదల ఆరోగ్యం కాపాడపడుతుంది. ప్రజాసంక్షేమం కోసం కొనసాగుతున్న జూనియర్ డాక్టర్ల సమ్మె పాలకులనుసరిస్తున్న ప్రపంచ బ్యాంకు విధానాలను సూటిగా నిలవేస్తున్నందునే పాలకులూ, వారి వంధిమాగధ బృందమంతా సమ్మెపై విరుచుకుబడుతుందని అన్ని వర్గాల ప్రజలూ చైతన్యవంతంగా గ్రహించాల్సి వుంది. ప్రజారోగ్యంతో బాటు యావత్ రాష్ట్రాన్నీ, దేశాన్నీ కొల్లగొట్టే ప్రపంచ బ్యాంకు విధానాల అమలును ప్రతిఘటించాలి. అప్పటి వరకు 'అందరికీ ఆరోగ్యం' అనే నినాదం కాగితాలకే పరిమితమవుతుంది.

●

అనాగరికం - ఆటవికం

# భండార్కర్ ప్రాచ్య పరిశోధనా సంస్థపై ఆటవిక దాడి

**- వకుళాభరణం రామకృష్ణ**

**ఈ నెల** 5వ తేదీన పూణె నగరంలో భండార్కర్ ప్రాచ్య పరిశోధనా పరిషత్‌పై శంభాజీ బ్రిగేడ్ జరిపిన విధ్వంసకాండ అత్యంత హేయమైనది. ఈ పరిశోధనా సంస్థ 1917లో ప్రసిద్ధ చరిత్రకారులు, సంస్కృత పండితులు, ప్రాచ్యవేత్తలైన భండార్కర్, బాపట్ మొదలగు వారిచే స్థాపించబడింది. జాతీయ భావ స్ఫూర్తితో చరిత్ర రచన కొత్త పుంతలు తొక్కుతూ, గతంలోకి చూసి, భారతీయ నాగరికతా సంస్కృతులను వెలికి తీస్తున్న సమయంలో ఈ సంస్థ ఏర్పడింది. అప్పటి నుండి అనేక అపురూపమైన రాతప్రతులను - సంస్కృత, పార్శీ భాషల్లో - గ్రంథాలను, ఫొటోలను, చిత్తరువులను సేకరించి భద్రపరిచింది. ప్రాచీన, మధ్యయుగాల చరిత్రకు, భాషా సాహిత్య, మతపరమైన పరిశోధనకే గాక, వేద సాహిత్యానికి ఇది కాణాచి లాంటిది. క్రీ.శ. 1919లో ఈ సంస్థ మహాభారతం ఇతిహాసాన్ని విమర్శనాత్మకంగా పరిష్కరించి, 19 సంపుటాలలో, 13 వేల పుటలతో ప్రచురించడం గొప్ప విశేషం.

ఇంతకూ ఈ సంస్థపై ఆటవిక దాడి ఎందుకు జరిగినట్లు? మనకందిన పత్రికా సమాచారాన్ని బట్టి దీని నిర్వాహక కమిటీ సభ్యుడు డా॥ శ్రీకాంత్ బహుల్కర్, అమెరికన్ చరిత్రకారుడు జేమ్స్ డబ్ల్యు. లేన్ రాసిన శివాజి : హిందు కింగ్ ఇన్ ఇస్లామిక్ ఇండియా' అనే గ్రంథ రచన తన తోడ్పాటును అందించడం. ఈ గ్రంథంలో ఛత్రపతి శివాజికి సంబంధించి కొన్ని అభ్యంతరకర భాగాలున్నాయని, అవి శివాజీ ప్రతిష్ఠకు భంగకరంగా వున్నాయని వీరి అభియోగం ఒక సంవత్సరం కిందటే, ఈ అభియోగం మోపపడ్డప్పుడు, ఆ పుస్తక విక్రయదారులు, మోతీలాల్ బనార్సీదాస్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ వాళ్ళు, అమ్మకాల నుండి ఈ పుస్తకాన్ని తొలగించారు. ఇది పిరికి చర్యగా కొందరు విమర్శించడమూ జరిగింది. కానీ, రక్షణ కొరవడ్డప్పుడు, దుండగుల ఆగడాలకు అడ్డు లేనపుడు చేయగలిగింది ఏముంది? ఇంతవరకూ ఒక మీడియా మినహా, ఈ చర్యను గర్హిస్తూ, జారీ చేసిన ప్రకటనలు, లేదా ఖండింపులూ లేకపోవడం ఆశ్చర్యం!

ప్రాచ్య అధ్యయనానికి అమూల్య సేవ చేసిన జర్మనీలో కూడా (మాక్స్‌మూలర్ పండితుడి కాలం నుండి) లేని అపురూప, ఎంతో విలువైన రాతప్రతులు ఇక్కడ లభ్యమవుతూ వుండేవి. భారతీయ, పాశ్చాత్య విద్వాంసులు, నెలలు, సంవత్సరాల తరబడి ఇక్కడ వుండి, ఇందులో లభించే అమూల్య విషయాలతో ఎన్నో ఉత్తమ గ్రంథాలు ప్రచురించడం జరిగింది. కాగా, ఈ విధ్వంసంలో వందా, యాభై మంది పాల్గొన్నట్లు భోగట్టా. టెలిఫోన్ తీగలు తెంచి, పోలీసులకు సమాచారం అందకుండా చేశారు. ఫర్నిచర్‌ను, బీరువాలను ధ్వంసం చేశారు. వేలాది గ్రంథాలను చించిపారేశారు. తాటాకులపై వున్న అముద్రిత రచనలను చెరిపి వేసి ఛిన్నాభిన్నం చేశారు. పురావస్తు పరిశోధనల్లో లభ్యమైన వస్తువులను పాత ఫొటోలను పగలకొట్టారు. అంతేగాక ఎన్నో గ్రంథాలను తమవెంట ఈ దుండగులు తీసుకెళ్ళారు కూడా. ధ్వంసమైన వాటిలో ఒక సరస్వతి విగ్రహం, గణేశుడి ప్రతిమ వుంది. శంకరాచార్య అనువదించిన రుగ్వేద ప్రతిని సంస్థ వెలుపల పేవ్‌మెంట్‌పై పడవేసి పోయారు.

ఈ ఘటనకు యావత్ జాతి సిగ్గుతో తలవంచుకోవాల్సి వుంది. క్రోషియన్, బోస్నియన్ సంస్కృతీ సంపదను సెర్బులు ధ్వంసం చేసినపుడు, తాలిబాన్లు బుద్ధుని విగ్రహాలను పడగొట్టినపుడు, ఇరాక్ యుద్ధంలో బాగ్దాద్ మ్యూజియంలోని వస్తువులను దోచుకొన్నప్పుడు, యావత్ ప్రపంచం ముక్తకంఠంతో ఈ చర్యలను ఖండించింది. అలాగే నేపాల్‌లోని దాంగ్ సంస్కృత విశ్వవిద్యాలయాన్ని మావోయిస్టులు ధ్వంసం చేసిన తీరును గర్హించింది. పూణెలో జరిగిన ఘటన వీటికి తీసిపోయేదేమీ కాదు.

ఈ సాంస్కృతిక, అధ్యయనపరమైన దాడులు ఈ మధ్యకాలంలో దేశంలో జరుగుతూ వుండడం ఆలోచనాపరులైన వారందరినీ ఎంతో కలవరపరుస్తున్నది. భారతీయ ప్రభుత్వం ఇలాంటి చర్యల పట్ల కఠిన వైఖరి అవలంభించక పోవడానికి ప్రజాస్వామ్య సంప్రదాయాలు, క్రమేపీ పలచబడుతూ, అడుగంటుతూ వుండడమేనా దీనికి కారణం? ప్రజాస్వామ్య దేశాల్లో అందునా భారత్‌లో కచ్చితంగా గ్యారంటీ చేయాల్సిన వాక్, సభా ప్రకటనా స్వాతంత్ర్యాలు హరించబడుతున్నాయా? ప్రజాస్వామ్య ఆచరణకు పట్టుగొమ్మయిన చట్టబద్ధపాలన (రూల్ ఆఫ్ లా) సరిగ్గా అమలు చేయబడుతున్నదా? హుస్సేన్ చిత్రాలను ధ్వంసం చేసినపుడు, వాటర్ సినిమా యూనిట్‌ను వారణాసిలో నిలదీసి, సెట్టింగులను, హోర్డింగులను పగులగొట్టినపుడు, రూల్ ఆఫ్ లా ఏమైనట్టు ?

చరిత్రలో వివాదాంశాలుండడం కొత్తేమీ కాదు. నిరంతరం సాగే చరిత్ర పరిశోధనలో ఎప్పటికప్పుడు కొత్త ఆధారాలు, పోకడలు, అభిప్రాయాలూ వస్తుంటాయి. వీటి సాయంతో కొత్త అర్థాలూ, నిర్వచనాలూ, భాష్యాలూ వస్తాయి. రావాలి కూడా. అప్పుడే చరిత్ర రచన సంపన్నమవుతుంది. చరిత్రకు యదార్థాలే ప్రమాణం. వాటి ఆధారంగా ఎవరి నిర్ధారణలు వారు చేస్తారు. వీటితో అంగీకరించిన వారు, విభేదిస్తూ, ఖండిస్తూ రచనలు చేయవచ్చు. అది ఆరోగ్యపరమైన అధ్యయన వాతావరణానికి దోహదం చేస్తుంది. ఇలాంటి చర్యల వల్ల, విదేశీ పరిశోధనలు, భారతదేశంపై పరిశోధనలు సాగించేందుకు ముందుకు రావడం కష్టమవుతుంది. ఇ.హెచ్.కార్, ఫాక్ట్స్ ఆర్ సేక్రెడ్, ఒపినియన్స్ ఆర్ ఇండిపెండెంట్ అన్నది ఈ ఉద్దేశంతోనే. ఈ చర్యకు పాల్పడ్డ ఛాందసులు, చరిత్రను వక్రీకరించి, గతాన్ని, గత వారసత్వాన్ని నిరాకరించే మతతత్వ వాదుల కంటే, ఒకడుగు ముందుకెళ్ళి చరిత్రను (సాహిత్య రూపంలో) నాశనం చేయడానికి పూనుకోవడం, ఫాసిస్టు పోకడలను గుర్తుకు తెస్తున్నది. ●

# ఈ - ఎత్తుగడల ఓవర్ స్మార్ట్ ప్రోగ్రెస్ రిపోర్టులు!

**- తెలకపల్లి రవి**

**ముందస్తు** ఎన్నికలు ప్రకటించిన తర్వాత ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తన ఈ-ఎత్తులతో మొదలు పెట్టిన ప్రహసనమే ప్రోగ్రెస్ రిపోర్టులు. సాధారణంగా ఈ మాటను వాడే అర్థానికి పూర్తి భిన్నంగా ఆయన ఈ తతంగం తలపెట్టారు. ప్రోగ్రెస్ రిపోర్టులు ఇచ్చేది టీచర్లు. దాన్ని చూసి మెచ్చుకునేది లేదా చివాట్లు పెట్టేది తల్లిదండ్రులు. దీన్నే ప్రజాస్వామ్యానికి వర్తింపజేస్తే ఇక్కడ రిపోర్టునివ్వాల్సింది ప్రజలే. వివిధ ఉద్యమాలు, ఆందోళనల ద్వారా వారు ప్రభుత్వ ప్రోగ్రెస్‌పై తమ అభిప్రాయాలు వెల్లడిస్తూనే వున్నారు. ఈ అంచనాల ఆధారంగా రేపు ఎన్నికల్లో వారిచ్చే తీర్పు అంతిమంగా ప్రభుత్వం పాసైంది లేదా ఫెయిలైంది తెలియజేస్తుంది. ఆ విషయంలో నమ్మకం లేకనే చంద్రబాబు ముందస్తు పేరుతో అసెంబ్లీ రద్దు చేయించి చేతులు దులుపుకున్నారు. ఇక అంతటితో విషయం వారి తీర్పుకు వదిలేయాలి. కాని ప్రోగ్రెస్ కార్డు దిద్దుకుని తనే మార్కులు వేసుకుని తుంటరి పిల్లాడిలాటి ఈ వ్యవహారం తలపెట్టారు. ఆయన స్మార్ట్ దశ దాటి 'ఓవర్ స్మార్ట్' పెంచేసుకున్న వైనాన్ని ఇది తెలియజేస్తుంది.

## ప్రచార పరంపర

పాలనాసామర్థ్యం సంగతి ఎలా వున్నా ప్రచార సామర్థ్యం మాత్రం పుష్కలంగా వున్న ముఖ్యమంత్రి మొదట్లో ఆకస్మిక పర్యటనలు కొంతకాలం, రచ్చబండ సమావేశాలు కొంతకాలం సాగించారు. వాస్తవంలో ప్రజాసమస్యలు వినడం కంటే తన ఆదేశాలకే పెద్దపీట వేశారు. అసలు బాధ్యత వహించవలసిన తన విధానాల సమస్య పక్కన బెట్టి స్థానిక అధికారులను సర్పంచులను (ముఖ్యంగా ప్రతిపక్షాలకు చెందిన వారిని) అక్కడికక్కడే మందలిస్తూ, బెదిరిస్తూ కఠినమైన పాలకుడు అనిపించుకోవడానికి తంటాలు పడ్డారు. ప్రజలు, ప్రతిపక్షాలు ఆ సందర్భాలను ఉపయోగించుకుని నిజంగా ప్రజా సమస్యలను లేవనెత్తడం మొదలెట్టాక చిందులు తొక్కసాగారు. ముఖ్యమంత్రి అందరికీ చెందిన వారుగా వుండాలనేది మరచిపోయి నీవు ఫలానా పార్టీ నీ సంగతి తెలుసులే. కూచో - ఇలాటి బెదిరింపులకు దిగారు. వీడియో కాన్ఫరెన్సులు, ఆ పైన డయల్ యువర్ సిఎం ప్రవేశ పెట్టారు. సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవడం తప్పేమీ కాదు. కాని అది నిశ్శబ్దంగా, అవసరాల ప్రాతిపదికన జరగాలి తప్ప కంప్యూటర్ జాతరగా కాదు. తాతకు దగ్గులు నేర్పినట్టు బిల్‌గేట్స్ దగ్గర కంప్యూటర్ డిస్‌ప్లే చేసి వచ్చిన చంద్రబాబు దృష్టి వేరు. ఏమైనా ఆయన గత టీవీ పెర్‌ఫార్మెన్స్ నిజానికి ఏమంత హిట్ కాలేదు. కొద్దికాలంలోనే ప్రేక్షకులు వాటిని పట్టించుకోవడం మానేశారు. ఇదివరకటిలా ఒక్కరే కాకుండా హంగుదారులతో సహా బుల్లితెరపై కనిపిస్తూనే ఏకపాత్రాభినయం సాగించారు. అయినా ఆయనకు ఎదురైన ప్రశ్నలు చూస్తే తెలుస్తుంది. ప్రేక్షకులుగా ప్రజలెంత అప్రమత్తంగా వున్నారో, దూరదర్శన్‌లో ముఖాముఖి కార్యక్రమం సాగించినపుడే ఆయన పెద్ద స్పందన పొందలేకపోయారు. ఈ వరసలోనే ఆయన మదిలో మెదిలిన మెరుపుతునక ఈ ప్రోగ్రెస్ రిపోర్టులు. అపద్దర్మ హోదాలో వున్న ప్రభుత్వాధినేత తన విజయాలను ప్రభుత్వ ఖర్చుతో చెప్పుకోవడం అధికార దుర్వినియోగం. నిజానికి దానికదే అధికార దుర్వినియోగం.

ఇదంతా చూసిన తర్వాత ఒక్క విషయం స్పష్టమవుతుంది. చంద్రబాబు ఉద్దేశపూర్వకంగానే ముందస్తు ఎన్నికల ప్రహసనం తలపెట్టారని. ఈ విధంగా ఆయన ఏడాది ముందే రాజకీయ చర్చను హైజాక్ చేశారు. అలిపిరి ఘటన ఇందుకు సాకు మాత్రమే. ఎన్నికలు జరుగుతాయా లేదా జరిగితే ఎపుడు జరుగుతాయి ఇత్యాది చర్చలలో జనం మునిగి తేలుతుంటే తను హాయిగా పబ్బం గడుపుకోవచ్చునని ఆయన తలపోశారు. కాని ఈ ప్రహసనంపై వ్యక్తమైన ప్రతికూల ప్రజాభిప్రాయాన్ని గమనిస్తే ఆయన ఎంతగా పొరబడింది అర్థమవుతుంది.

## జీవితానుభవాల ఫలితం

ఇది మరో రకంగా జరిగే అవకాశమే లేదు. చంద్రబాబు పరిపాలనా సామర్థ్యం గురించి, తెలివి తేటల గురించి అదే పనిగా ప్రచారం జరుగుతుంది. కాని వాస్తవంలో ఆయన పాలన అత్యంత లోపభూయిష్టమైంది. అందువల్లనే ప్రోగ్రెస్ రిపోర్టుల కోసం ఎంచుకున్న ఏ ఒక్క అంశంలోనూ చంద్రబాబు నాయుడు వాస్తవంగా నివేదించలేదు. అసలు అవసరమైన వివరాలు గాక అసందర్భ అంశాలతో ముంచి తేల్చారు. ఆ పైన పరిచయాలు, కొలువు కూటమి తరహా పరిచయాలతో కొంత సమయం వృధా చేశారు.

ఈ తతంగంలో ఇంతకంటే తమాషా అయిన అంశాలున్నాయి. ముఖ్యమంత్రి శాంతిభద్రతల గురించి ఘనంగా చెబుతుంటే హైదరాబాద్‌లో హత్యల పరంపర సాగిపోయింది. పాతకాలం నాటి దారి దోపిళ్ళను మించిపోయే విధంగా రాజధానిలో బందిపోట్లు జరిగాయి. ఆయన ఆరోగ్యరంగంలో అభివృద్ధి చెప్పాలనుకుంటే జూనియర్ డాక్టర్ల సమ్మె మోతెక్కిపోయింది. ఆయన ఉపాధి గురించి నివేదిక పెడదామనుకుంటే ఉద్యోగాలు రాని వారి ఫోన్లు హోరెత్తాయి. చివరకు ఆయన అందరూ ప్రభుత్వోద్యోగాలు కోరుకోరాదని చెప్పవలసి వచ్చింది. పర్మనెంటు ఉద్యోగాలు ఇస్తే పని చేయరని కూడా ఆయనన్నారు. మూతపడిన పరిశ్రమల కార్మికులు ఘోషించారు. నిరుద్యోగులకు ఉపాధి కల్పించండి అని ఇంకెవరో మొత్తుకున్నారు. ఇలా ఒక్కోరంగంలో చెప్పుకునే గొప్పలు కుప్పకూలుతుంటే బిత్తరపోవడం ముఖ్యమంత్రి వంతయింది. ఇంతా అయ్యాక ఆయన విజన్ డాక్యుమెంటు అంటూ ప్రవేశ పెట్టారు. దాన్ని పాత్రికేయులే ప్రశ్నలతో ముంచెత్తితే మీ మైండ్‌సెట్ మారాలని పాత పల్లవిని వినిపించారు. వాస్తవానికి మారవలసింది ఆయన మైండ్‌సెట్. గత ఆరేళ్ళలో అది మరీ పొరబాటు దారిపట్టింది. ప్రజాస్వామ్య వ్యవస్థలో ముఖ్యమంత్రి ప్రజాప్రతినిధి అనేమాట మరచిపోయి ఆయన సిఇవోగా వ్యవహరించడం మొదలెట్టారు. అక్షరాలా

ప్రపంచ బ్యాంకు సిఇవో గానే ప్రవర్తించారు. రోడ్లు, రేషన్ కార్డుల నుంచి ప్రతిదీ దాని ఆదేశాలకు అనుగుణంగా చేశారు. ప్రజలకు తిండి, పని, ఇల్లు వంటి కనీస సదుపాయాలు కాకుండా ఫైవ్ స్టార్ వ్యాపారాలే ప్రగతి అని భ్రమింప చేయడానికి ప్రయత్నించారు. రాష్ట్రం భయంకర క్షామంలో అల్లాడుతుంటే ఆయన ఒకటవ నెంబర్ రేసులు తేవడానికి విదేశాలకు వెళ్ళారు. మలేరియా, అతిసార, డెంగ్యూ వంటి వ్యాధులు తిరగబెట్టి వందల ప్రాణాలు బలితీసుకుంటుంటే ఆయన హైదరాబాద్ ఆరోగ్య రాజధాని అని మురిపించే ప్రయత్నం చేశారు. ఇరిగేషన్ ప్రాజెక్టులు ఘోర నిర్లక్ష్యానికి గురై ప్రాంతీయ ఉద్రిక్తతలు తలెత్తుతుంటే ఆయన తన రాజకీయ ప్రయోజనాల గురించి మాత్రమే లెక్కలు వేసుకుని హడావుడి శంకుస్థాపనలు చేశారు. ఎన్నికలు జరుగుతాయా లేదా అనే దానిపై దాగుడుమూతలు నడుపుతూనే రోజులో మూడు శంకుస్థాపనలు చేసి కొత్త రికార్డు నెలకొల్పారు! అత్యధిక కాలం పాలించానని చెప్పుకునే ముఖ్యమంత్రి ఇంత ఆదరాబాదరాగా శంకుస్థాపనలు చేయడంలోనే తెలుస్తుంది మిగిలిన కాలమంతా ఎంత వృధాగా గడిచిపోయిందో!

ముఖ్యమంత్రి రిపోర్టుల నేపథ్యంలో వాస్తవాలను కూడా ఒక్కసారి చూడబోతే కనిపించేదేమిటి ?

## మద్యం సరఫరాలో మహత్తర ప్రోగ్రెస్

చంద్రబాబు నాయుడు ప్రభుత్వం మద్యం మాఫియాకు రాష్ట్రాన్ని ధారాదత్తం చేసింది. వూరూరా బెల్టు షాపులు పెట్టించారు. ఎంతోమంది అభాగ్యులు మద్యం మహమ్మారికి బలయ్యారు. ఒక్క గుంటూరు జిల్లాలోనే వరుసగా మద్యం వల్ల అనేకులుచనిపోయారు. మద్యం కంపెనీలకు అవసరమైన దానికన్నా రు.500 కోట్లు అధికంగా చెల్లించిన వ్యవహారంలో సాక్షాత్తూ చంద్రబాబుపైనే దర్యాప్తు జరపాలని న్యాయస్థానం ఆదేశించినా కిమ్మనలేదు.

## ఆకలిచావులు, హాహాకారాలు :

రాష్ట్రంలో కరువు మూడేళ్ళు వరుసగా పీడించి పిప్పి చేసింది. అనంతపురం, మహబూబ్‌నగర్ జిల్లాల్లో నాలుగో ఏడు కూడా కరువు కోరలు చాస్తున్నది. ఆకలి చావులు, ఆత్మహత్యలతో విషాద పరిస్థితి నెదుర్కొంటుంటే కనీస సహాయ చర్యలు తీసుకొని చంద్రబాబు సర్కార్ బిందు సేద్యమని ఇంకా ఏమేమో కబుర్లతో కాలక్షేపం చేస్తున్నది. కేంద్రం బియ్యం పంపినా కరువు ప్రాంతాల్లో పనికి ఆహారం పథకం అమలు జరపకుండా పార్టీ వారికి ఫలహారంగా సమర్పించింది. ఇటీవలి కాలంలో కనీవినీ ఎరుగని ఈ భయానక క్షామం తెలుగుదేశం పాలన తీరుకు ప్రత్యక్ష సాయం. ఇక పట్టణాల్లో పేదలకు పనులు లేవు. ఇళ్ళస్థలాలు లేవు. భూబకాసురులు ప్రభుత్వ భూములనే కబ్జా చేస్తుంటే కదలని ఈ ప్రభుత్వం పేదలు గుడిసెలు వేసుకుంటే మాత్రం ఉక్కుపాదంతో అణచివేసింది.

## స్వర్ణాంధ్రా? రుణాంధ్రా ?

ఈ ఎనిమిదేళ్ళలో ప్రభుత్వం రాష్ట్రాన్ని అంతులేని అప్పుల వూబిలో దించింది. అప్పుల భారం 57 వేల కోట్లకు దేకింది. ఏటా ఏడు వేల కోట్లు అప్పు అసలు, వడ్డీల చెల్లింపుల కింద పోతున్నది. ఈ ముందస్తు ముచ్చట వెనక కూడా రు.1100 కోట్ల రూపాయల అప్పు మూటలు సాగుతున్నాయి. తెచ్చిన అప్పుకోసం ఒప్పుకున్న షరతులు రాష్ట్ర ప్రజలపై 6000 కోట్ల రూపాయల వడ్డింపులకు దారితీశాయి. విద్యుత్, ఆర్టీసి చార్జీలు, నీటి తీరువా, కాలేజీ ఫీజులు అన్ని పెరిగిపోయాయి. రేషన్ కార్డులకు ఎసరు పెట్టి, పేదలకు ముద్దలేకుండా చేశారు. ఇప్పుడు ఎన్నికల కోసం మళ్ళీ ఆ పాచిక తీశారు.

ప్రభుత్వం రైతాంగాన్ని వధ్యశిలపై నిలిపింది. రెండు వేల మందికిపైగా రైతులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. రైతాంగం రుణభారం రు.12000 కోట్లకు పైగా అప్పుల్లో కూరుకుపోయినా ఆదుకోలేదు. మోటార్లకు కనీసం కరెంటు లేక రైతాంగం అల్లాడిపోతుంటే కబుర్లే మిగిలాయి. సహాయం కోరిన రైతులపై అనంతపురంతో సహా అనేక చోట్ల లాఠీ ఛార్జిలు చేసింది. రంగారెడ్డి జిల్లా చేవెళ్ళలో కాల్పులు జరిపి రైతును బలిగింది. మార్కెటింగ్ సదుపాయాలు కలిగించకుండా నరకయాతన పెట్టింది. నల్లబెల్లం, ఆక్వా, పట్టు, పసుపు, వేరుశెనగ ఒకటేమిటి ప్రతిరంగంలో రైతు కూడా భయానక పరిస్థితిని ఎదుర్కొంటున్నాడు. వ్యవసాయం అంటేనే జీవన్మరణ పోరాటమై పోయింది. రుణాలపై వడ్డీ మాఫీ హామీ గాలికెగిరి పోగా బ్యాంకుల జప్తులు, దాడులతో రైతాంగం నలిగిపోయింది.

## వేలకోట్లు మింగిన కుంభకోణాంధ్ర

ఈ ఎనిమిదిళ్ళలో చంద్రబాబు ప్రభుత్వం సాధించిన రికార్డు ఏదైనా వుంటే కుంభకోణాలేనని నకిలీ స్టాంపు పేపర్‌పై సంతకం చేసి మరీ చెప్పొచ్చు. అప్పులు తెచ్చిన సొమ్ము తెలుగుదేశం కాంట్రాక్టర్ల పరమైన క్షణాల మీద కోట్లకు పడగలెత్తుతున్నారు.

రాష్ట్రంలో నకిలీ స్టాంపుల కుంభకోణం 5,000 కోట్లు, మూసేసిన అర్బన్ బ్యాంకుల్లో డిపాజిట్లు 2,000, నీరు-మీరు పథకం ఖర్చు 1,600, వాటర్‌షెడ్ పథకం ఖర్చు 2,000, పనికి ఆహార పథకం 560, ప్రభుత్వ సంస్థల అమ్మకం వల్ల నష్టం 400, మద్యం అక్రమాలు 600, సోమశిల భూములు కుంభకోణం 112, స్కాలర్‌షిప్‌లు 100, ముఖ్యమంత్రి సహాయ నిధి 10, విజయవాడ సిమెంట్ ఫ్యాక్టరీ స్థలం 55, టూరిజానికి ఇచ్చిన స్థలాల విలువ 350, మాదాపూర్‌లో రహేజా సంస్థకు స్థలం 50, ఏలేరు భూకుంభకోణం 100, టైమర్ల కుంభకోణం 30 మొత్తం 12,367 కోట్లు.

ఇవి గాక ఇంకా లెక్కించని పన్ను రాయితీలు, స్వదేశీ సంస్థలకు అప్పనంగా అప్పగించిన భూములు, కాకినాడ, ఓడరేవుల్లో పోర్టుల నిమిత్తం ప్రయివేటు సంస్థలతో కుదుర్చుకున్న ఒప్పందాలు, ఇరిగేషన్ పనుల్లో అవినీతి, నకిలీ నోట్లు, స్టేషనరీ కుంభకోణం, సిమెంట్ ఫ్యాక్టరీలకు ఇచ్చిన రాయితీలు, కాందిశీకులకు ఇచ్చిన భూముల్లో జరిగిన అవినీతి, చిన్నా, చితకా కుంభకోణాలు వందల సంఖ్యలో ఉన్నాయి. ప్రపంచ బ్యాంకు నుండి తెచ్చిన రుణంలో జరిగిన అవినీతి ఏరులై పారింది. వీటన్నింటినీ లెక్కించకుండానే ఈ ఎనిమిదేళ్ళలో 12 వేల కోట్లకు పైగా కుంభకోణాల్లో ప్రజల సొమ్ము ఇరుక్కుపోయింది. అన్నీ బహిర్గతమైతే మరో 10 వేల కోట్లు వున్నా ఆశ్చర్యపడనక్కర్లేదు. అంటే మొత్తం కైంకర్యమైన సొమ్ము ఇరవై వేల కోట్ల పైనే! ఈ డబ్బుతో ఎన్ని కరువులో నివారించి వుండొచ్చు. ఎన్నో ప్రాజెక్టులు పూర్తి చేసి వుండొచ్చు!

పనికి ఆహారం బియ్యం దారి మళ్లించడం వీటిలో మరీ దారుణమైంది. అనేకమంది తెలుగుదేశం నాయకులు, సర్పంచుల ఇళ్ళలో ఈ బియ్యం నిల్వలు దొరికాయి. పాలకొల్లులో దొరికిన అక్రమ నిల్వనుతప్పించడంలో మంత్రి సుబ్బరాయుడు హస్తం వున్నట్లు వెల్లడైంది. బ్రిటిష్ సంస్థ ఈ వ్యవహారంపై నిర్వహించిన సర్వేలో ఈ అవినీతి భాగోతాలు వెలుగు చూడటం అంతర్జాతీయ అప్రతిష్ట.

దళిత బలహీన వర్గాలకు, వెనుకబడిన వారికి ఈ ప్రభుత్వం పూర్తిగా మొండిచెయ్యి చూపించింది. చేతివృత్తిదార్ల కోసం ప్రకటించిన ఆదరణ పథకం అవినీతికి ఆలవాలమైంది. మహబూబ్‌నగర్‌లో దళిత మహిళపై అత్యాచారం హత్య వంటి ఘటనల దర్యాప్తుకు శ్రద్ధ చూపలేదు. కులవివక్ష వ్యతిరేక పోరాట సంఘం రెండుసార్లు ర్యాలీలు చేస్తే దారుణమైన లాఠీఛార్జీ జరిపించింది. ఎంతో ఆందోళన తర్వాత గాని ఎస్‌సి ఎస్‌టి కమీషన్ ఛైర్మన్‌ను నియమించలేదు. బిసిల స్కాలర్‌షిప్పులను స్వాహా చేశారు. విద్యా సంస్థలలో వారికి రావలసిన కోటాను దారిమళ్లించారు.

మైనార్టీలలో ప్రభుత్వం తీవ్ర అభద్రతా భావం కలిగించింది. వారిపై ఆకారణ పహారా వాతావరణం సృష్టించింది. బిజెపితో చెలిమి వల్ల మతకలహాల ప్రమాదం పెరిగింది. హైదరాబాద్ పదేళ్ళ తర్వాత మళ్ళీ కలహాలు, కర్ఫ్యూ చూడాల్సి వచ్చింది. మరోవైపు వక్ఫ్ ఆస్తులు దారుణంగా దోచుకోబడుతున్నా ప్రభుత్వం ఎలాంటి చర్యలు తీసుకోలేదు.

## పెట్టుబడులు - కట్టుకథలు

తన హయాంలో విదేశాల నుంచి పెట్టుబడులు వెల్లువగా వచ్చినట్టు చంద్రబాబు ప్రచారం చేసుకుంటారు. అదేపనిగా విదేశాలు తిరుగొస్తుంటారు. కాని వాస్తవంగా వచ్చింది నామమాత్రమని ఇండియా టుడే ఈ లెక్కలిచ్చింది :

| | చెప్పిన పెట్టుబడులు | వచ్చిన పెట్టుబడులు |
|---|---|---|
| 2001 | రు.52,428 కోట్లు | రు.1670 కోట్లు |
| 2002 | రు.8474 కోట్లు | రు.1566 కోట్లు |

## ఆరోగ్య ఎమర్జన్సీ :

రోజూ హైటెక్ కబుర్లు చెప్పే చంద్రబాబు పాలనలో వ్యాధులు విపరీతంగా ప్రబలి ఆరోగ్య ఎమర్జన్సీ విధించాల్సి వచ్చింది. ప్రతివారూ ప్రాణంగా చూసుకునే పిల్లలే ఈ వ్యాధులు ఎక్కువగా భరించాల్సి వచ్చింది. మలేరియా, డెంగ్యూ, డయేరియా వగైరాలతో అల్లాడిపోవడమే కాక అనేకమంది అమాయక బాలలు మరణించారు కూడా. అడవి ప్రాంతాల్లో గిరిజనులు యాభై మందికి పైగా చనిపోయారు. వడదెబ్బకు కూడా ఏనాడూ లేని విధంగా వందల మంది మరణించారు. హైదరాబాద్‌ను ఆరోగ్య రాజధానిగా ముఖ్యమంత్రి చెబుతుంటే ఆయన వూరించే స్వర్ణాంధ్ర రోగాంధ్రగా మారింది. వైద్య చికిత్స, వైద్య విద్య పూర్తిగా వ్యాపారమయమై పోవడంతో జూనియర్ డాక్టర్లు అపూర్వమైన రీతిలో నిరవధిక పోరాటం సాగించవలసి వచ్చింది. అయినా ప్రభుత్వానికి చలనం లేదు.

## మహిళలకు అభద్రత - అశ్లీలతకు పట్టం

హోం మంత్రి నివాసానికి కూతవేటు దూరంలో ముగ్గురు తల్లీ కూతుళ్ళను చంపిపారేస్తే ఇప్పటికి నిందితుల ఆచూకీ లేదు. సినీ తార ప్రత్యూష మృతి కేసు అనేక అనుమానాలకు ఆస్కారమిచ్చింది. అనేకసార్లు మహిళా ప్రదర్శనలపై అమానుష లాఠీచార్జిలకు తలపడ్డారు. అంగన్‌వాడీలపై విరుచుకుపడ్డారు. వ్యభిచార వృత్తికి లైసెన్సు ఇవ్వాలని ప్రతిపాదించి వెనుక్కు తగ్గారు. డిస్కోథెక్‌ల పేరుతో అసభ్య నృత్యాలకు పచ్చజెండా వూపి కంగుతిన్నారు. ఎయిడ్స్ నివారణ పేరుతో మహిళా వ్యతిరేక అడ్వర్టయిజ్‌మెంట్ ఇచ్చి దెబ్బతిన్నారు. ఆఖరుకు బిల్‌గేట్స్ అప్పుమీద ఆశతో అసెంబ్లీని కండోమ్స్ ఎగ్జిబిషన్‌గా మార్చి అవమానించారు. ఇంకోవైపున మహిళలు కష్టించి ఏర్పాటు చేసుకున్న డ్వాక్రా గ్రూపులకు నామకార్థంగా సహాయం విదిల్చి విపరీత ప్రచారం చేసుకున్నారు.

## కార్మికులు, ఉద్యోగుల దురవస్థలు

ఈ ప్రభుత్వ హయాంలో అనేక మిల్లులు ఫ్యాక్టరీలు మూతబడి వేలమంది కార్మికులు, ఉద్యోగులు వీధుల పాలైనారు. అనేకవేలమంది పనులు కోల్పోనున్నారు. ఉపాధ్యాయ పోస్టుల భర్తీలో కూడా మాటలకు చేతలకు పొంతన లేదు. ఇటీవలనే ప్రాథమిక పాఠశాలల టీచర్లను తగ్గించబోయి నిరసన ధాటికి వెనక్కు తగ్గింది. విద్యా రంగానికి నిధులు కేటాయించకుండా మాడ్చుతూ రాష్ట్రాన్ని చదువులో 22వ స్థానానికి నెట్టింది.

రేపటి తరం భవిష్యత్తుతో ప్రభుత్వం చెలగాటమాడుతున్నది. ప్రభుత్వరంగంలో అన్ని ఉద్యోగాలు కాంట్రాక్టు పద్ధతినే భర్తీ చేస్తానని ప్రకటించి వెనక్కు తగ్గింది. రిక్రూట్‌మెంట్లు చాలా కాలం జరపకుండా అట్టిపెట్టి ఇపుడు హడావుడి ప్రారంభించింది. మోసగాళ్ళు నిరుద్యోగులకు టోకరా ఇస్తుంటే అడ్డుకోకపోగా అందుకు దోహదం కలిగిస్తోంది.

## శాంతిభద్రతల వైఫల్యం

పోలీసు శాఖ అసమర్థత వల్ల రాష్ట్రంలో శాంతిభద్రతలు కుప్పకూలాయి. హైదరాబాద్ దాని చుట్టుపక్కల భయానకమైన దోపిడీలు, హత్యలు జరిగాయి. రోజుకో మాయ కంపెనీ బోర్డు తిప్పి మధ్య తరగతి పొదుపరులను దివాళా ఎత్తించినా ఒక్కరిని కూడా పోలీసులు పట్టి శిక్షించలేదు. పరిహారం ఇప్పించింది లేనేలేదు. ఇదే పోలీసులు ప్రపంచీకరణ ఫార్ములా ప్రకారం ప్రజా ఉద్యమాలపైన విచక్షణా రహితమైన లాఠీఛార్జీలకు దమనకాండకు పాల్పడుతున్నారు.

## ఈ-ప్రగతికి వేరే నివేదికలెందుకు ?

కనుక ఏ విధంగా చూసినా తెలుగుదేశం పరిపాలన అవినీతికి, అసమర్థతకు, అవకాశవాదానికి మారుపేరుగా తయారైంది. సెస్ ఇటీవల ప్రచురించిన పత్రాలలో కూడా రాష్ట్రం వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలోనూ, వైద్య విద్యా రంగాలలోనూ చాలా రాష్ట్రాల కంటే వెనుకబడినట్లు చెప్పారు. జీవితానుభవాలు, అధికారిక నివేదికలు అధ్వాన్న స్థితిని కళ్ళకు కట్టినట్టు ఇంత స్పష్టంగా చెబుతుంటే, ప్రోగ్రెస్ రిపోర్టులిచ్చి మభ్యపెట్టాలనుకోవడం నిజంగా దుస్సాహసమే. లోగడ ప్రత్యక్షంగా ప్రజలను కలుసుకోవడంలో వున్న చిక్కులు తెలిసివచ్చి బుల్లితెరను ఆశ్రయిస్తే అక్కడా అదే పరిస్థితి వెంటాడటం కంటే ముఖ్యమంత్రిగారి ప్రగతికి వేరే దాఖలాలేం కావాలి? ○

# సమ్మె హక్కు దానం ఇచ్చింది కాదు! రద్దు చేసినా పోదు!!

- ఆర్.సుధాభాస్కర్
సిఐటియు రాష్ట్ర కార్యదర్శి

సమ్మెలన్నా, ఉద్యమాలన్నా పాలకులకు నేడు తేళ్ళు, జెర్రులు పాకినట్లుంది. వాటిని అణచడం ఎట్లానా అని నిత్యం ఒకటే ఆలోచన, పెల్లుబుకుతున్న కార్మికోద్యమాన్ని అడ్డుకునేందుకు రెండు మార్గాల్ని వారెంచుకుంటున్నారు. ఒకటి ఉద్యోగులు, కార్మికులకు, చివరికి తమ సభ్యులకు సైతం ఎన్ని ఇబ్బందులు, కష్టాలు వచ్చినా ఖాతరు చేయక సంస్కరణలకు జేజేలు పలికే కార్మిక సంఘాలను, వ్యక్తులను ప్రోత్సహించడం, రెండు - రాజ్యాంగ యంత్రాన్ని అంటే చట్టసభలు, కోర్టులు, చట్టాలు మొదలైన వాటిని ఉపయోగించి ఉద్యమాలను అణచివేసేందుకు ప్రయత్నించడం. ప్రస్తుతం ఈ రెండవ అంశానికి మన చర్చను పరిమితం చేద్దాం.

**పోరాడి సాధించుకున్న హక్కుల్ని పోరాటాలతోనే నిలబెట్టుకోవాలి!**

కొద్దిగా చరిత్రలోకి తొంగిచూస్తే - పెట్టుబడిదారీ విధానంతోనే 'ప్రజాసామ్యం' ఉనికిలోకి వచ్చింది. అయితే అది వారి ప్రయోజనాలను కాపాడినంత వరకేననుకోండి! 1933 నాటి నాజీ జర్మనీ నుండి (రజనీపామీదత్ రాసిన "ఫాసిజం అండ్ సోషల్ రివల్యూషన్" పుస్తకం చూడండి) 1974 నాటి ఇం(దిరా)డియా వరకు మనకు కనపడేది ఇదే! ఎన్నికలు, పార్లమెంట్లు, అసెంబ్లీలు గట్రా వచ్చాయి. "స్వాతంత్రం, సమానత్వం, సౌభ్రాతృత్వం" అనే నినాదాలిచ్చిన ఫ్రెంచి బూర్జువా వర్గంతో సహా, ఏ దేశ పెట్టుబడిదారులూ కార్మికవర్గం సంఘాలు పెట్టుకోడాన్ని, సమ్మెలు చేయడాన్ని ఆహ్వానించలేదు సరికదా అడ్డుకోవడానికి, అణచివేయడానికి పూనుకున్నారు.

ప్రజాస్వామ్య సూత్రాలు తమ పెరట్లోనే మొలకెత్తాయని బడాయి గొట్టే ఇంగ్లండులో ఆస్థిలేని వారికి కూడా ఓటు హక్కు ఉండాలని కార్మికవర్గం "ఛార్టిస్టు ఉద్యమం" లేవదీసిన తర్వాతనే సార్వత్రిక ఓటు హక్కు వచ్చిందని మరువరాదు. ఆ తర్వాతనే "కాంబినేషన్ చట్టాల" కు (ఇద్దరు కలిసి యజమాని వద్దకు వెళ్తే అతనికి వ్యతిరేకంగా కుట్ర చేసినట్లు భావించబడేది) మంగళం పాడారు బ్రిటిష్ పెట్టుబడిదారులు.

మన దేశంలోనూ ఆ కోవలో పుట్టినవే "మాస్టర్స్ అండ్ సర్వెంట్స్ యాక్ట్" "వర్క్‌మెన్స్ బ్రీచ్ ఆఫ్ కాంట్రాక్టు యాక్ట్" వంటివి. సుదీర్ఘ పనిగంటలను తట్టుకోలేక పారిపోయే కార్మికులను బంధించడానికి, శిక్షించడానికి యజమానులకు పూర్తి స్వేచ్ఛపై చట్టాల ద్వారా దఖలు పర్చబడింది.

ఇంతకీ నేను చెప్పొచ్చేదేమంటే పెట్టుబడిదారీ వర్గం ఇష్టాఇష్టాలతో సంబంధం లేకుండా మన దేశంలోనైనా, మరెక్కడైనా కార్మిక చట్టాలు పుట్టాయి. చట్టం లేక ముందు నుండి పోరాడి సాధించుకున్న కార్మికవర్గం, దశాబ్దాల పాటు అనుభవించిన తర్వాత ఇపుడు ఆ హక్కులను పాలకులు రద్దు చేస్తుంటే చూస్తూ ఊరుకుంటుందా? ఊరుకోవాలా?

**సమ్మెక్కు కథా కమామీషు!**

ఈ అంశం చర్చించేటపుడు మరో పిట్ట కథ కూడా చూడాలి! 2003 ఆగస్టులో సుప్రీంకోర్టు చెప్పిన తీర్పు కేవలం ఉద్యోగులకే పరిమితమని కొందరు ప్రబుద్ధులు, కాదు కేవలం తమిళనాడు ఉద్యోగులకే వర్తిస్తుందని మరికొందరు మేధావులు నమ్మబలుకుతున్నారు. వాస్తవం ఏమిటి?

పార్టీలకు బంద్‌లు చేసే హక్కులేదని కేరళ హైకోర్టు తీర్పు చెప్తే, ప్రదర్శనలు చేయరాదని కలకత్తా హైకోర్టు తీర్పు చెప్పింది. బిఎస్ఎన్ఎల్ ఉద్యోగులు "ధర్నా" చేయరాదని పంజాబ్ హైకోర్టు ఆర్డరేసింది. గతంలో పోస్టర్ ఉద్యోగుల సమ్మె సందర్భంగా 3వ తరగతి ఉద్యోగులు సమ్మె చేయడమేమిటని, సమ్మెలో వున్న ఉద్యోగులతో ప్రభుత్వం చర్చలు జరపడమేమిటని ఢిల్లీ హైకోర్టు చేసిన వ్యాఖ్యలు ఈ సందర్భంగా గమనార్హం. 3వ తరగతి ఉద్యోగులు దీర్ఘకాలిక సమ్మెలు చేయడం ఏమిటని ముంబాయి హైకోర్టు ప్రశ్నించింది. సమ్మె హక్కుపై సుప్రీం తీర్పు తర్వాత మేఘాలయ ప్రభుత్వం విద్యార్థి ఉద్యమంపై పత్రికల్లో వార్తలు ప్రచురించరాదని ఆర్డినెన్స్ చేసింది. ఇవన్నీ చూస్తే ఇది ప్రభుత్వ ఉద్యోగులకు మాత్రమే పరిమితమైన అంశమని ఎవరైనా భావించవచ్చా?!

ఇక అసలు విషయంలోకొద్దాం. ప్రపంచమంతా కార్మికవర్గం పుట్టినప్పట్నించి సమ్మెలు చేస్తూనే వున్నారు. ప్రభుత్వోద్యోగులు కూడా స్వాతంత్ర్యానికి ముందు, ఆ తర్వాత కూడా సమ్మెలు చేస్తున్నారు. కేంద్ర ప్రభుత్వోద్యోగులు ప్రతి పే కమిషన్ సందర్భంలోను సమ్మెలు చేస్తూనే వున్నారు. బీహార్, హర్యానా, రాజస్థాన్, జమ్ము-కాశ్మీర్ మొదలైన చోట్ల రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు 10 రోజుల నుండి 75 రోజుల వరకు సమ్మెలు చేశారు.

సంఘం పెట్టుకునే హక్కు మన రాజ్యాంగమిచ్చిన ప్రాథమిక హక్కు సంఘం పెట్టుకునేది యజమానులకు ప్రభుత్వానికి సేవ

చేయడానికి కాదు కదా!? తన సభ్యుల జీవన పరిస్థితులు బాగు చేయడమే లక్ష్యమని యూనియన్ రూల్స్‌లో రాసి వుంటుంది. యజమానులు, ప్రభుత్వాలు తమ సభ్యుల జీవితాలపై దాడి చేసినపుడు స్పందించకపోతే ఇక యూనియన్ ఎందుకు? తమిళనాడు ప్రభుత్వం తమ ఉద్యోగుల రిటైర్‌మెంటు బెనిఫిట్లపైనా, ఇతర సర్వీసు కండిషన్లపైనా దాడి చేసింది. దాన్ని అడ్డుకునేందుకు వారు చేసిన అన్ని ప్రయత్నాలు విఫలమై, చర్చలకు అన్నిదార్లు మూసుకుపోయిన తర్వాత చిట్టచివరి ఆయుధమైన సమ్మెకు చిట్టచివరిగానే ప్రయత్నించారు. అతి దుర్మార్గమైన టెస్మాని రద్దు చేయమని పోరాడారు.

కామన్‌సెన్స్ వున్న వారెవరైనా వారి సమ్మెను బలపరుస్తారు. కాని సెన్సే లేని వారికి కామన్‌సెన్స్ ఎక్కడ్నించి వస్తుంది? సుమారు 2 లక్షల మందిని ఒకేసారి శిరచ్ఛేదం చేసింది "పురచ్చితలైవి". ఇదేం అన్యాయమని "సుప్రీం"ని వేడుకుంటే మీకదే తగిన శాస్తి అంటూ తీర్పు చెప్పింది.

సరళీకృత విధానాలకు కోర్టులు, జడ్జీలు అతీతం కాదుకదా!

వర్గ సమాజంలో న్యాయం కూడా వర్గ న్యాయంగానే వుంటుంది. దానికీ ఉదాహరణ చాలనుకుంటా, ఎఐబిఇఎ నాయకత్వంలో చేయతలపెట్టిన దేశవ్యాపిత బ్యాంకు ఉద్యోగుల సమ్మెను 1966లో ప్రభుత్వం నిషేధించింది. సమ్మె చేయకపోతే రాజ్యాంగం ఇచ్చిన సంఘం పెట్టుకునే ప్రాథమిక హక్కుకు అర్థం ఏంటని ఎఐబిఇఎ సుప్రీంకోర్టులో సవాలు చేసింది. ఆనాడు ఆ వాదనను తిరస్కరించిన సుప్రీంకోర్టు 1978లో ఇదే తరహా వాదన మేనకా గాంధీ చేస్తే అంగీకరించింది. 1978లో జనతా ప్రభుత్వం అధికారంలో ఉంది. నేటి ప్రధాని ఆనాడు విదేశాంగ మంత్రి, మేనకా గాంధీకి ప్రభుత్వం పాస్‌పోర్టు తిరస్కరించింది. తాను జర్నలిస్టును కాబట్టి, ప్రతి పౌరుడు తన ఇష్టమొచ్చిన వృత్తి స్వీకరించే హక్కు రాజ్యాంగం ఇచ్చిన ప్రాథమిక హక్కు కాబట్టి, తనకు పాస్‌పోర్టు తిరస్కరించటం ద్వారా తన వృత్తి ధర్మానికి ప్రభుత్వం భంగం కలిగించిందని ఆమె సుప్రీంకోర్టుకెళ్తే ఆ వాదనను అంగీకరించి, ఆమెకు పాస్‌పోర్టు ఇప్పించింది. లక్షలాది బ్యాంకు ఉద్యోగులకొక న్యాయం, పాలకవర్గ ప్రతినిధులకొక న్యాయం ఇదే వర్గనీతి.

అనేక సందర్భాల్లో ప్రభుత్వాలు సమ్మెలను నిషేధించడాన్ని కోర్టులు బలపరిచినా సమ్మెలు సాగుతూనే వున్నాయి. వాటి వాడి, వేడి రెండూ తగ్గలేదన్న విషయం గమనార్హం.

## ఎవరు ఎటువైపో తేల్చిన సుప్రీంకోర్టు తీర్పు

ఈ తీర్పు ఏ సందర్భంలో, ఎందుకోసం ఇచ్చినా తర్వాతి పరిణామాలు కార్మికవర్గానికి చాలా ప్రాముఖ్యత కలిగిన అంశాలు. అందునా ఈ ఎన్నికల సంవత్సరంలో!

సాధారణ సమయాల్లో "కార్మిక బంధు" బిరుదాంకితులు, "పద జనబాంధువు"లు మనకు తారసపడ్తుంటారు. కాని ఇది పరీక్షా సమయం. ఈ సందర్భంలో వివిధ పార్టీల స్పందనలు చూస్తే ఎవరు ఎటువైపో తేల్తుంది. సిపియం పక్ష నాయకుడు శ్రీ సోమనాథ్ ఛటర్జీ ఈ తీర్పు అమలు కాకుండా రాజ్యాంగానికి సవరణ చేయండని పార్లమెంటులో నిలదీస్తే బిజెపి, కాంగ్రెస్, టిడిపి వంటి పాలక పార్టీలన్నీ కిమ్మనలేదు. సమ్మెలు నష్టమని, ట్రేడ్ యూనియన్లు అరిష్టమని తానెప్పట్నించో చెప్తున్న దాన్ని సుప్రీంకోర్టు కూడా బలపరిచిందని మన రాష్ట్రంలో రాష్ట్రంలోని ప్రపంచ బ్యాంకు ముద్దుబిడ్డ పలవరిస్తున్నారు. తమిళ కాషాయనేతలు ఇప్పటికైనా 'పురచ్చితలైవి' కి సాష్టాంగ పడమని ఆ రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు సలహా పడేశారు. అవును మరి! తదుపరి ఎన్నికల్లో ఆమె మీదే కదా ఆధారపడాల్సింది? లైన్ క్లియర్ చేసుకోవద్దూ!! కాంగ్రెస్ అధినాయకత్వం ఇంకా తీర్పును అధ్యయనం చేస్తూనే ఉందట! ఇదీ ఆ పార్టీల నైజం.

ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగం వున్నంతవరకూ సమ్మెలుంటాయని ప్రకటించిన జ్యోతిబాసుకు, పై బాపతుకు నాగలోకానికి నక్కకు వున్నంత తేడా కనడపట్లేదా! కలకత్తా నగరంలో ర్యాలీలపై ఆ రాష్ట్ర హైకోర్టు ఆంక్షలు పెడితే సిపిఎం దాన్ని బహిరంగంగా వ్యతిరేకించింది. విమర్శించి కోర్టు ధిక్కారనేరం కేసు కూడా ఎదుర్కొంటోంది. రివ్యూ పిటీషన్ వేసి స్టే వచ్చే వరకు ప్రతిరోజు ఒక ప్రజాసంఘం ర్యాలీలు నిర్వహించింది. ప్రజాస్వామ్యం పట్ల విశ్వాసం ఉండే వారి స్పందన అది కాగా, పెట్టుబడిదారుల ప్రయోజనాలకై వెంపర్లాడే వారి స్పందన దానికి పూర్తి భిన్నంగా ఉండటంలో ఆశ్చర్యమేముంది.

## అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతి నాపగలరా?

యూనియన్లను నియంత్రించడానికి 1926లో ట్రేడ్ యూనియన్ చట్టం తయారు చేశారు. కాని బ్రిటీష్ పాలకులే నియంత్రించలేకపోయారు. 1920వ దశకం ద్వితీయార్థంలో చెలరేగిన కార్మిక పోరాటాలను నియంత్రించడానికే మొదట బొంబాయి ట్రేడ్‌డిస్ప్యూట్స్ యాక్ట్ చేశారు. 1928లో బొంబాయి టెక్స్‌టైల్ కార్మికులు వెంటవెంటనే చేసిన రెండు సుదీర్ఘ సమ్మె పోరాటాలు ఆ ప్రయత్నాన్నీ వమ్ము చేశాయి. అప్పట్నించి స్వాతంత్రం వచ్చే వరకు సాగిన పోరాటాలను తట్టుకునేందుకు 1947లో పారిశ్రామిక వివాదాల చట్టం చేయబడింది. ఏ సమ్మె చట్టబద్ధమైనదో, ఏది కాదో ఆ చట్టంలో పేర్కొనబడింది. ప్రజోపయోగ సర్వీసుల్లో 14 రోజుల నోటీసు లేకుండా సమ్మె చేయరాదన్నారు. అయినా నేడు ఆర్టీసి, సింగరేణి వంటి చోట్ల వైల్డ్ క్యాట్ సమ్మెలు సాగుతూనే వున్నాయి. ప్రతి ప్రజోపయోగ సర్వీసులోను ప్రతి ఆరు నెల్లకు సమ్మెలు నిషేధించే ఆర్డరు వస్తూనే వుంది. అయినా సమ్మెలు ఆగాయా?

అందుకే అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతిని ఆపలేరు. కోర్టు తీర్పులు, పాలకుల నిషేధాలు సమ్మెలనాపలేవు. ●

"స్వదేశానికి విదేశీ నాయకత్వమా?" సోనియాపై ముఖ్యమంత్రి

**– రాష్ట్రాన్ని ప్రపంచ బ్యాంకుకు తాకట్టు పెట్టిన ముఖ్యమంత్రేనా ఈ మాట అనేది ?**

"తీవ్రవాదులను పాక్ ఎదుర్కొంటుంది" బుష్

**– ప్రపంచ వ్యాప్తంగా ఆ బాధ్యత అమెరికా పెద్దన్నకి అప్పచెప్పినట్టున్నారే!**

"ప్రగతి నివేదికలపై దుష్ప్రచారం" ఉమ్మారెడ్డి

**– అసలు ప్రగతి నివేదికే పెద్ద దుష్ప్రచారం**

"వాజ్‌పేయ్ దిష్టిబొమ్మను నేపాల్‌లో దగ్ధం చేసినందుకు భారత్ తీవ్ర నిరసన" భారత ప్రభుత్వం

**– బుష్ బొమ్మను భారత్‌లో అనేక చోట్ల దగ్ధం చేస్తున్నందుకు అమెరికా ఇలాగే నిరసన తెలిపిందా?**

"సంకల్పం సగం బలం" ప్రభుత్వ పేదరిక నిర్మూలనా ప్రయత్నాన్ని హర్షిస్తూ 'ఈనాడు' సంపాదకీయానికి శీర్షిక.

**– రాష్ట్రంలో పేదరికం 15 శాతం మందికి మాత్రమే కాబట్టి సగం బలం అక్కర్లేదు, ఆరోవంతు చాలు.**

"కాశ్మీర్ పరిష్కారానికి ఇదే ఆఖరి యత్నం" వాజ్‌పేయ్.

**– అవును మరి, ప్రధాని కుర్చీ ఇంకో నాలుగైదు నెలల్లో ఖాళీ అయిపోతుంది కదా.**

"సెన్సెక్స్ దూకుడు" వార్త

– సెన్సెక్స్ దూకుతోందని చిన్నసైజు మదుపుదారులు దూకటం ప్రారంభిస్తే కాళ్ళు విరగ్గొట్టుకోవాల్సి రావచ్చు జాగ్రత్త

"కాశ్మీర్ ఊసెత్తని పాక్" వార్త

**– వాజ్‌పేయ్ ఎత్తారుగా**

"కానిస్టేబుళ్ళకు పదోన్నతి హుళక్కేనా?"

**– ఎందుకంత నిరాశ, నక్సలైట్ ప్రాబల్య ప్రాంతాల్లో పనిచేసే కొందరు కానిస్టేబుళ్ళను ఆదర్శంగా తీసుకుంటే పోలా!**

"పగలు విద్యార్థి, రాత్రి ఆటోడ్రైవర్‌గా కుటుంబం బండి లాగుతున్న గిరిజనుడు" – వార్త

**– ఈ గిరిజనుడు గొప్పా ? 18 గంటలు మాత్రం పని చేసే ముఖ్యమంత్రి గొప్పా ?**

"మేడారం జాతర ఏర్పాట్లు చురుగ్గా పూర్తి చేయండి" ముఖ్యమంత్రి ఆదేశం

**– ఓట్ల జాతర ముందుందిగా.**

"ముంబైలో కదులుతున్న రైలుపై కూలిన వంతెన" వార్త

**– వంతెనలు కూలి రైలు ప్రమాదాలతో రైల్వే శాఖకు బోరు కొట్టి వుండాలి.**

"ఇది (జోగీ వ్యవహారం) సిగ్గు చేటు చర్య" అద్వాని

**– మరి జుదేవ్ వ్యవహారమో?**

"పోలీసులను సేవకులుగా చూస్తున్న సర్కార్" బీహార్‌లో తొలగించిన డి.జి.పి.

**– పదవి నుండి తొలగించిన తర్వాతనే తెలిసిందా?**

"అజిత్‌జోగి వ్యవహారం అంత సిగ్గు చేటైన విషయం మరొకటి లేదు" అద్వానీ

**– గురివిందగింజ తన కింద నలుపు (జుదేవ్ వ్యవహారం) తానెరుగదట.**

"పాతబస్తీ అల్లర్ల బాధ్యులను వదలం" చంద్రబాబు

**– బాధ్యతను విస్మరించిన పోలీసు అధికారులను కూడానా?**

"డ్వాక్రా సంఘాల సమావేశానికి రాలేనన్న దేశం" వార్త

"ప్రపంచ బ్యాంకు తాజా రుణంపై సమావేశానికి పిలిచినా రాని దేశం" రాఘవులు

"చర్చకు ముఖ్యమంత్రి సవాల్ విసరగా కాంగ్రెస్ రెడీ అంటే ఉలుకూ పలుకూ లేని దేశం" వార్త

**– మరి దేశం దేనికి స్పందిస్తుందట ?**

"చర్చలే శరణ్యం, తూటాలతో సాధించలేం" అజాద్

**– అవును, తూటాలతో రాజ్యం రాదని నక్సలైట్లను విమర్శిస్తూ తూటాలతో సమస్యకు పరిష్కారం సాధిస్తానని ప్రభుత్వం అంటుందేమిటి?**

"వారసత్వ ఆస్తులను కుమార్తెకు బహుమతిగా ఇవ్వవచ్చు" సుప్రీం సంచలన తీర్పు

**– ఆస్తులు లేని పేదలకు ఆస్తులు సంక్రమించే విధంగా తీర్పు ఎపుడు వస్తుందో**

"ముషారఫ్ అంటే నాకెంతో నమ్మకం" బుష్

**– ఎందుకో! భారత్–పాక్ చర్చల్లో కాశ్మీర్ అంశాన్ని ప్రస్తావించనని హామీ ఏమైనా ఇచ్చాడా?** ○

**మూా** కుమ్మడి ప్రయివేటీకరణకు రాష్ట్రాన్ని చంద్రబాబు ప్రయోగశాలగా మార్చారు. 342 మిలియన్ పౌండ్లను తీసుకోవడం ద్వారా బ్రిటన్‌కు చెందిన డి.ఎఫ్.ఇ.డి. (అంతర్జాతీయ అభివృద్ధి శాఖ)కి చంద్రబాబు అనుకూలంగా వ్యవహరిస్తున్నారు. ఇది ఇథియోపియా కరువుకాటకాలకు చేసిన ఖర్చు కంటే పదిహేను రెట్లు ఎక్కువ. చిలీకి పినోచెట్ ఏమిచేసాడో చీఫ్ ఎగ్జిక్యూటివ్‌గా పేరుతెచ్చుకోవాలనుకున్న చంద్రబాబు కూడా రాష్ట్రానికి అదే చేస్తున్నాడు.

-బ్రిటన్‌కు చెందిన గార్డియన్ దినపత్రిక

**ఈశాన్య** రాష్ట్రాల్లో ఒక్కో చోట ఉన్న ఓటర్ల సంఖ్య కంటే రాష్ట్రంలో నమోదైన బోగస్ ఓట్ల సంఖ్య అధికం.

-సురవరం

**విద్య** ద్వారా శాస్త్ర, సాంకేతికాభివృద్ధి జరిగి మానవ జీవనయానం సుఖమయం కావడంలేదు. ఆర్థికాభివృద్ధి సిద్ధించడం ద్వారా జీవన ప్రమాణాలు పెరగడం లేదు. ఈ రెండు ప్రయోజనాలు సిద్ధించడం లేదంటే విద్యా విధానానికి చికిత్స అవసరం.

-చుక్కా రామయ్య

**మనం** రోజూ తీసుకునే ఆహారంలో 8 రకాల పురుగుమందుల అవశేషాలున్నాయి. అందులో అయిదింటికి సంబంధించిన అవశేషాలు పరిమితికి మించి 140 నుండి 721.8శాతం వరకూ ఉన్నాయి.

-సెంటర్ ఫర్ సైన్స్ అండ్ ఎన్విరాన్‌మెంట్

**మతోన్మాద** హింసను దేశంలో వివిధ ప్రాంతాల్లో వ్యాప్తి చేసేందుకు హిందూత్వ శక్తులకు ప్రవాస భారతీయుల నుండి నిధులు అందుతున్నాయి.

-ప్రముఖ నటుడు, రచయిత గిరీష్‌కర్నాడ్

**బిజెపి** విధానాల వల్ల ప్రజల్లో తీవ్రమవుతున్న అసంతృప్తిని చల్లార్చేందుకు ఆ పార్టీ మతాన్ని ఆశ్రయిస్తుంది.

- ప్రముఖ రాజకీయ పరిశోధకురాలు, మంజరీ కప్సూ

**కేంద్రంలోనూ,** రాష్ట్రంలోనూ ముందస్తు ఎన్నికలు జరపాలని ఆయా ప్రభుత్వాలు నిర్ణయించడం రాజకీయ లబ్ధికోసమే.

-అన్నాహజారే

'**ప్రపంచబ్యాంకు** విధానాలను తిప్పికొడితేనే అందరికీ ఆరోగ్యం'. 'ఆరోగ్యం అంటే కేవలం మందులు, డాక్టర్లు మాత్రమే కాదు. ప్రజలందరికి తిండి, మంచినీరు ఉపాధి దొరికితేనే ఆరోగ్యంగా ఉండడం సాధ్యం'.

- వాల్డెన్ బెల్లో, దబిద్ లెగ్గే (డబ్ల్యు.ఎస్.ఎఫ్., ముంబాయి సమావేశాల సందర్భంగా)

**రాష్ట్రంలోని** 58.4శాతం మంది ఓటర్లు సాగునీరు, తాగునీరు, నిరుద్యోగం- ఈ మూడు సమస్యలే అమితంగా బాధిస్తున్న ప్రధాన సమస్యలని అభిప్రాయపడ్డారు.

- ఆంధ్రజ్యోతి దినపత్రిక సర్వే

**కోస్తా-ఆంధ్ర** ప్రాంతంలో దేశం-బిజెపి కూటమికి రెండు శాతం ఓట్లు తగ్గి గత ఎన్నికల్లో గెలిచిన 102 సీట్లు రేపటి ఎన్నికల్లో 84కు తగ్గుతున్నాయి. 43 నుండి 45కు ఓట్ల శాతాన్ని పెంచుకోనున్న కాంగ్రెస్ పార్టీ గత ఎన్నికల్లో గెలిచిన 27 సీట్ల నుండి రేపటి ఎన్నికల్లో 45 అసెంబ్లీ స్థానాల్లో విజయకేతనం ఎగురవేయనుంది.

- అసోసియేటెడ్ బ్రాడ్‌కాస్టింగ్
(టెలివిజన్ చానెల్ సర్వే)

**పాలస్తీనాలోని** ఉగ్రవాదుల కన్నా ఇజ్రాయిల్ అనుసరిస్తున్న రాజ్యహింస ప్రమాదకరమైనది.

-బ్రిటన్‌లోని సౌదీఅరేబియా రాయబారి, ప్రిన్స్ టర్కీ ఆల్‌ఫైజల్

**దక్షిణాది** రాష్ట్రాలతో పోలిస్తే మహిళలపై జరుగుతున్న రకరకాల నేరాల్లో ఆంధ్ర రాష్ట్రానిది అగ్రస్థానం.

-నేషనల్ క్రైం రికార్డ్ బ్యూరో

**కోలా,** పెప్సీలు ఇండియా విడిచిపోవాలి.

-ఫ్రాన్స్ రైతు ఉద్యమనాయకుడు చేస్‌బోవె

**వేసవి** కష్టాలు, కరువు పరిస్థితులు, తదితరాల వల్ల, రిస్కును, రాజకీయ పతనాన్ని తప్పించటానికి రాష్ట్ర ఎన్నికలు వర్షాకాలం నుంచి వసంతకాలానికి మరాయి... రాష్ట్రంలో వర్షాధార పంటలే దిక్కుగా ఉన్న కొన్ని ప్రాంతాల్లో ఎడారీకరణ కనిపిస్తున్నది.

-ప్రపంచ బ్యాంకు

# ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ (ఐ) (1999) ఎన్నికల ప్రణాళిక

*(గత రెండు సంచికల్లో వరుసగా తెలుగుదేశం, బి.జె.పి.లు 1999 ఎన్నికలకు ముందు విడుదల చేసిన ఎన్నికలప్రణాళికలను ప్రచురించాం. చివరగా కాంగ్రెస్ (ఐ) ఎన్నికల ప్రణాళికను మీ ముందుంచుతున్నాం - సం.)*

**అశేషమైన** సహజ వనరులు, సుదీర్ఘమైన సముద్రతీరం, కష్టపడి పని చేసే ప్రజలు వున్న ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి ప్రాంతీయ పార్టీ సంకుచిత దృష్టి, స్వార్థ ప్రయోజనాల కారణంగా గండిపడింది. గత అయిదేళ్ళుగా అనేకరంగాలలో తిరోగమన ధోరణులు దర్శనమిస్తున్నాయి. ఎడాపెడా అప్పులు తెచ్చి ఒక ప్రణాళిక లేకుండా, ఒక పద్ధతి లేకుండా ఖర్చు చేయడం, ప్రచారం చేసుకోవడం పరిపాలనగా చెలామణి అవుతోంది. ప్రచారార్భటాన్ని పక్కకు పెట్టి వాస్తవాలు గమనిస్తే రాష్ట్రం ఏమైపోతున్నదో రేఖామాత్రంగానైనా తెలుస్తుంది. 15 ఏళ్ళక్రితం అభివృద్ధి విషయంలో దేశంలోని రాష్ట్రాల జాబితాలో పై నుంచి మూడో స్థానంలో ఆంధ్రప్రదేశ్ ఉండేది. తెలుగుదేశం ప్రభుత్వం ధర్మమా అని అది ఇప్పుడు 13వ స్థానానికి పడిపోయింది. రాష్ట్రంలో ప్రస్తుతం పారిశ్రామిక పెట్టుబడుల పెరుగుదల శాతం 36.14 శాతం కాగా రాజస్థాన్‌లో 50.2 శాతం, ఉత్తర ప్రదేశ్‌లో 47.54 శాతం, మధ్యప్రదేశ్‌లో 47.02 శాతం. కొత్త పరిశ్రమ ఒక్కటీ రాకపోగా ఉన్న పరిశ్రమలు వందలాది ఖాయిలాపడి మూతపడ్డాయి. వ్యవసాయరంగంలో పరిస్థితి మరీ దారుణం. ప్రభుత్వ అసమర్థత, నిర్లక్ష్యం వల్ల వందలాది మంది పత్తిరైతులు ఆత్మహత్య చేసుకున్నారు. నీటిపారుదల రంగంలో పెట్టుబడులు తగ్గిపోయాయి. విద్య, ప్రాథమిక వైద్య, ఆరోగ్య రంగాలలో, ఇతర సంక్షేమ రంగాలలో పరిస్థితి దయనీయం. ఆదిలాబాద్, విశాఖ జిల్లాల్లో ఆదివాసులు వేలాది మంది విషజ్వరాల వల్ల దుర్మరణం పాలైతే సర్కారు ప్రేక్షక పాత్ర పోషించింది. పరిపాలన వికేంద్రీకరణకు విఘాతం కలిగింది. సర్వాధికారాలు ముఖ్యమంత్రి చేతులలో కేంద్రీకృతం కావడంతో ఇతర మంత్రులు డమ్మీలు అయ్యారు. అధికారులు డూడూ బసవన్నలు అయ్యారు. ప్రచారమే ప్రధానం అయిపోయింది. ఫలితంగా వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో బలమైన పునాది వేసే అవకాశం చేజారిపోయింది. ప్రజాస్వామ్య వ్యవస్థలూ, రాజ్యాంగబద్ధంగా ఏర్పడిన సంస్థలూ నీరుగారిపోతున్నాయి. బడ్జెట్‌లో చెప్పేది ఒకటీ, వాస్తవంలో చేసేది మరొకటిగా వంచనాశిల్పం రాజ్యం చేసింది. చేసేది చెప్పరు. చెప్పేది చేయరు అన్న చందంగా సాగుతోంది వ్యవహారం. అధికారులనూ, పోలీసు యంత్రాంగాన్నీ తన చేతుల్లో కీలుబొమ్మలుగా చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. కులాల మధ్య, ఒకే కులంలో వర్గాల మధ్య తంపులు పెట్టి, వేరుకుంపట్లు పెట్టించి సామాజిక సామరస్యానికి తీరని హాని చేశారు. ఎవరితో ఏ ఒప్పందాలు చేసుకుంటున్నారో, ఏది ఎక్కడ ఎంత ధర చెల్లించి కొంటున్నారో, ఎవరికి ఏమి తాకట్టు పెడుతున్నారో, ఎన్నికోట్లు చేతులు మారుతున్నాయో, విదేశీ బ్యాంకులకు తరలిపోతున్నాయో తెలియకుండా అత్యంత గోప్యంగా జరిగిపోతున్నాయి ఒప్పందాలు. పారదర్శకత వాగ్దానాలకే పరిమితం. నేరాలు పెరుగుతున్నాయి. అవినీతి పెచ్చరిల్లుతోంది. నిరుద్యోగం వికటాట్టహాసం చేస్తున్నది. సంపన్నులకే సేవలందిస్తున్న తెలుగుదేశం సర్కారు పేద ప్రజలను పట్టించుకోవడంలేదు. చివరికి పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థపైనే ప్రజలకు నమ్మకం సడలే ప్రమాదం కనిపిస్తున్నది. ఈ ధోరణిని అంతం చేయడం ప్రథమ కర్తవ్యంగా కాంగ్రెస్ పార్టీ భావిస్తున్నది. అబ్రహం లింకన్ చెప్పినట్లు 'ప్రజల కోసం, ప్రజల చేత, ప్రజల యొక్క' పరిపాలనను పునరుద్ధరించి, వ్యవస్థలో విశ్వాసం నెలకొల్పాలి. ఇందుకు పారదర్శకత అత్యవసరం. ప్రజల భాగస్వామ్యం ప్రధానం. ప్రజాస్వామ్య సంప్రదాయాల్ని మనస్ఫూర్తిగా గౌరవిస్తూ దారిద్ర్యం నిర్మూలనకు, నిరక్షరాస్యత అంతానికి, అసమానతల తొలగింపునకు, లింగవివక్షను రూపుమాపేందుకు కాంగ్రెస్ పార్టీ కృషి చేస్తుందని పునరుద్ఘాటిస్తున్నాం.

సమసమాజంగా, సస్యశ్యామలంగా, నిత్యశోభితంగా, ప్రశాంత సీమగా, సంపన్నభూమిగా 'ఆదర్శాంధ్రప్రదేశ్'ను ఆవిష్కరించేందుకు ఈ క్రింది లక్ష్యాలపై దృష్టి కేంద్రీకరించాలని కాంగ్రెస్ పార్టీ భావిస్తున్నది :

1. అన్ని ప్రాంతాల అభివృద్ధితో పాటు ఆర్థిక రంగంలో స్వావలంబన సాధన.
2. పరిపాలనలో వికేంద్రీకరణ.
3. 'జన్మభూమి' స్థానంలో గాంధీజీ ప్రబోధించిన 'గ్రామస్వరాజ్' కార్యక్రమాన్ని శక్తిమంతంగా, జనభాగస్వామ్యంతో చురుకుగా అమలుపరచడం
4. రైతులకు ఉచితంగా విద్యుత్తు, ఋణాల బకాయిల మాఫీ.
5. 'ఇందిరా కల్యాణ్' పథకం కింద పేద మహిళలకు వంటగ్యాస్ కనెక్షన్లు పాత దరఖాస్తుదారులతో సహా మంజూరు చేయడం, గర్భిణీ స్త్రీలకు ఆర్థిక సహాయం. రక్షిత మంచినీరు సరఫరా. బలహీన వర్గాల వారందరికీ మరుగుదొడ్లు కట్టించడం.
6. ప్రాథమిక విద్య, ప్రాథమిక ఆరోగ్యం ప్రజలందరికీ

అందుబాటులోకి తీసుకురావడం.

7. ధరలను అదుపులో పెట్టడం, ద్రవ్యోల్బణానికి కళ్ళెం వేయడం, అభివృద్ధి రేటును గణనీయంగా పెంచడం.

8. 'రాజీవ్‌రోజ్‌గార్' పథకం కింద నిరుద్యోగులైన పట్టభద్రులకు రెండేళ్ళపాటు ఏటా రు.2,500ల చొప్పున భృతి చెల్లించడం.

9. 'జవహర్ జ్యోతి' పథకం పేరుతో బలహీన వర్గాల వారి కాలనీలలో ప్రతి ఇంటా ఒక కరెంటు దీపాన్నీ, దానికయ్యే విద్యుచ్ఛక్తినీ ఉచితంగా ఇవ్వడం.

10. 'గరీబీ హఠావో' ప్రధాన లక్ష్యంగా ఇందిరాగాంధీ ప్రకటించిన 20 సూత్రాల కార్యక్రమం అమలు.

11. సమాజంలో అశాంతి వెనుకగల మూల కారణాలు తెలుసుకొని వాటి పరిష్కారానికి కృషి. పౌరహక్కులు మానవ హక్కుల పరిరక్షణ. రాష్ట్ర స్థాయిలో మానవ హక్కుల కమిషన్ ఏర్పాటు.

ఇవేకాకుండా భారత జాతీయ కాంగ్రెస్ ప్రకటించిన ఎన్నికల ప్రణాళికలోని, సిద్ధాంతాలనూ, విధానాలనూ, కార్యక్రమాలనూ, పథకాలనూ తు.చ. తప్పకుండా నిజాయితీగా అమలు చేయడం.

## ఆర్థిక వ్యవస్థ - స్వావలంబన

ఇతర రాష్ట్రాలతో పోటీపడి పరిశ్రమలనూ, వ్యాపార సంస్థలనూ రాష్ట్రంలోకి ఆకర్షించే విధంగా పన్నుల వ్యవస్థను హేతుబద్ధంగా సవరించాలని కాంగ్రెస్ పార్టీ సంకల్పిస్తున్నది. ఇందుకు అవసరమైన వ్యూహాన్ని రూపొందించేందుకు ప్రవీణులతో కూడిన ఉన్నత స్థాయి సంఘాన్ని నియమించి మూడు మాసాలలోగా సిఫార్సులు చేయవలసిందిగా ఆదేశిస్తాం.

కాంగ్రెస్ ప్రభుత్వం సరైన రుణ విధానాన్ని రూపొందిస్తుంది. అప్పులు చేయడం అత్యవసరం అయితే ఆ నిధులను సామాజిక సంపదను సృష్టించే కీలక రంగాలపైనే ఖర్చు చేయాలన్న విధానాన్ని అనుసరిస్తుంది. బాధ్యతారహితంగా అప్పులు చేయడం, విచ్చలవిడిగా ప్రచార పటాటోపాలపైనా, అనుత్పాదక కార్యకలాపాలపైనా ఖర్చు చేయడాన్ని అనుమతించే ప్రసక్తి ఉండదు.

మానవీయ దృష్టితో ఆచరణాత్మకమైన ప్రైవేటీకరణ విధానాన్ని కాంగ్రెస్ అనుసరిస్తుంది. సామాజిక బాధ్యతనూ, కార్మికుల ప్రయోజనాలనూ, రాష్ట్ర దీర్ఘకాలిక అవసరాలనూ దృష్టిలో పెట్టుకొని ఈ విషయంలో వ్యవహరిస్తాం. మెరుగైన యాజమాన్య పద్ధతుల ద్వారా, నిధుల సమీకరణ ద్వారా ప్రభుత్వరంగ సంస్థలను సమర్థంగా నిర్వహించే ప్రయత్నం త్రికరణ శుద్ధిగా జరుగుతుంది. ఎవరికో లాభించే విధంగా ప్రభుత్వ సంస్థల్ని ఎండగట్టి తెగనమ్మే విధానాన్ని కాంగ్రెస్ నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తున్నది. స్వయం పోషకత్వం సాధించే దిశలో ప్రభుత్వ సంస్థల్ని నడిపిస్తాం. వృత్తులలో అధునాతన పనివిధానాలను ప్రవేశ పెడతాం. గాంధేయ గ్రామీణ స్వయం సమృద్ధి విధానాన్ని ఆచరిస్తాం.

## సకల ప్రాంతాల అభివృద్ధి

రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాలన్నిటినీ అభివృద్ధి చేయడం కాంగ్రెస్ పార్టీ లక్ష్యంగా పెట్టుకుంది. ఇందుకోసం...

1. తెలంగాణా, రాయలసీమ, ఉత్తరాంధ్ర, రాష్ట్రంలోని తక్కిన బడుగు ప్రాంతాలలో జనాభా, వెనుకబడినతనం ప్రాతిపదికగా బడ్జెట్‌లో నిధులు కేటాయిస్తాం.

2. మరీ వెనుకబడిన ప్రాంతాలకు ప్రత్యేక నిధులు అందిస్తాం.

3. రాష్ట్రం వెలుపలి సంస్థల నుంచి ఆర్థిక సహాయాన్ని అందుకున్నప్పుడు దానిని వెనుకబడిన ప్రాంతాలలో అందరూ అంగీకరించిన దామాషా ప్రకారం ఖర్చు చేస్తాం.

4. తుంగభద్ర, వంశధార, జంఘావతి, గోదావరి, కృష్ణా, పెన్న పరీవాహక ప్రాంతాలలో అన్ని నీటిపారుదల ప్రాజెక్టులను నిర్ణీత కాల వ్యవధిలోగా పూర్తి చేస్తాం.

5. కొత్తగా మరి మూడు విద్యుత్ కేంద్రాలను నెలకొల్పుతాం. వీటిలో ఒక కేంద్రాన్ని ప్రత్యేకంగా జంటనగరాల విద్యుత్ అవసరాలు తీర్చేందుకు అనుకూలంగా ఏర్పాటు చేస్తాం.

6. తెలంగాణాలోని వెనుకబడిన ప్రాంతాలలో విద్య, వైద్య సౌకర్యాలను మరింత విస్తరిస్తాం. రామానందతీర్థ డీమ్డ్ యూనివర్సిటీని పూర్తిస్థాయి గ్రామీణ విశ్వవిద్యాలయంగా అభివృద్ధి చేయడం, వృత్తి కళాశాలల్లో సీట్ల సంఖ్య పెంచడం, ఉద్యోగావకాశాలు పెంపొందించడం కూడా అవసరమని కాంగ్రెస్ భావిస్తున్నది.

7. కోర్టు తగాదాలలో అపరిష్కృతంగా ఉన్న భూముల విషయంలో సత్వర చర్యలు తీసుకొని, అటువంటి భూములను భూమిలేని బీదవారికి పంచుతాం.

8. ప్రాంతీయ ప్రణాళిక, అభివృద్ధి బోర్డుల్ని పునరుద్ధరిస్తాం.

9. ఆరు సూత్రాల పథకాన్ని సమర్థంగా అమలు జరుపుతాం. ఈ సూత్రాల ఆచరణ పర్యవేక్షణ విభాగాన్ని పటిష్టం చేస్తాం.

## పరిపాలన

ఎంతోకాలంగా వున్న ప్రజాస్వామ్య సంస్థలను నీరుగార్చి తాత్కాలికంగా ఏర్పాటు చేసుకున్న సంస్థల ద్వారా, రూపొందించిన పథకాల ద్వారా అధికారం చెలాయించడం తెలుగుదేశం ప్రభుత్వం అనుసరిస్తున్న కుటిలనీతి. ఈ రంధిలో పంచాయితీరాజ్, రెవెన్యూ వ్యవస్థలు అవస్థలపాలై అచేతన స్థితిలో పడిపోయాయి. స్వరాజ్యం

వచ్చినప్పటి నుంచీ గ్రామీణాభివృద్ధి ప్రేరకాలుగా వున్న ఈ శాఖలను తుంగలో తొక్కి ఎవరికీ జవాబుదారులు కాని వ్యక్తులకు నిధులు మంజూరు చేయడం, పనులు జరగకుండా నిధుల కైంకర్యం జరగడం, ఈ విపరీతాన్ని అధికారులు ప్రేక్షకుల వలె చూడటం గత అయిదేళ్లుగా ఆంధ్రప్రదేశ్‌లో సాగుతున్న భాగోతం. చేసిన పనులు కాగితాలపై తప్ప వాస్తవంలో కనిపించవు. నిధులు మాత్రం వందల కోట్ల రూపాయలు దుర్వినియోగం అయినట్లు ఆరోపణలు సర్వత్రా విన్పిస్తున్నాయి. దేనికీ ప్రతిపాదన, ఆమోదం, మంజూరు, ఖర్చు ఆడిట్ వంటి పద్ధతులు వర్తించడం లేదు. ఈ అపభ్రంశాన్ని అరికట్టి, అధికారులు తమ విధులను తాము నిర్భయంగా, నిష్పాక్షికంగా, ప్రజాహితమే ధ్యేయంగా నిర్వర్తించే పరిస్థితుల్ని పునరుద్ధరించాలి. ప్రజాసంస్థల్ని క్రియాశీలం చేయాలి. వాటికి వనరులు, సాంకేతిక పరిజ్ఞానం, నిధులు సమకూర్చాలి. ప్రజాసంస్థలకూ, ప్రభుత్వ అధికారులకూ మధ్య సమన్వయం ఉండాలి. కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన వెంటనే జిల్లా ప్రణాళిక సంఘాల్ని ఏర్పాటు చేస్తుంది.

పాలనా సౌకర్యార్థం కొన్ని విభాగాలను పునర్‌వ్యవస్థీకరించవలసిన అవసరం వున్నదని కాంగ్రెస్ పార్టీ భావిస్తోంది. కొన్ని జిల్లాలు విస్తీర్ణంలో, జనాభాలో చాలా పెద్దవి కావడం వల్ల పాలన కష్టతరం అవుతోందన్న వాస్తవాన్ని గ్రహించింది. కనుక చిన్న జిల్లాల ఏర్పాటుకు అవసరమైన చర్యలు తీసుకోవాలనీ, ఒక జిల్లాకు అమరజీవి పొట్టిశ్రీరాములు పేరు పెట్టి ఆ ధన్యజీవికి సముచితమైన రీతిలో నివాళులు అర్పించాలనీ కాంగ్రెస్ కోరుతున్నది. పంచాయతీ సంస్థలకు అవసరమైన నిధులు సమకూర్చడం, వాటికి పరిపాలనాపరంగా, ఆర్థికంగా స్వయం నిర్ణయాధికారాలు ఇవ్వడం సాంకేతిక సహకారం అందించడం కాంగ్రెస్ విధానం. పంచాయతీ సంస్థలు సాగించే అభివృద్ధి కృషిని ప్రభుత్వ శాఖలు పర్యవేక్షిస్తాయి. సలహాలు అందిస్తాయి. ఈ విషయంలో రాజ్యాంగం 73వ సవరణలో పేర్కొన్న 29 అంశాల్ని స్థానిక సంస్థలకు వర్తింపజేసి వాటికి అధికారాలు దఖలు పరచడమే కర్తవ్యమని కాంగ్రెస్ పార్టీ భావిస్తోంది.

### వ్యవసాయం, నీటిపారుదల

అన్నపూర్ణగా పేరు ప్రతిష్టలున్న ఆంధ్రప్రదేశ్‌లో రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం, ఆకలికి తట్టుకోలేక మరణించడం విషాదకరం. కొన్నేళ్ళుగా రాష్ట్రంలో పంట దిగుబడి తగ్గడమే కాకుండా వ్యవసాయ భూముల ఉత్పాదకత దెబ్బతిన్నది. ప్రభుత్వం సరఫరా చేస్తున్న నాసిరకం విత్తనాలు, కల్తీ పురుగుల మందులు, రసాయనిక ఎరువులు ఈ దుస్థితికి ప్రధాన కారణాలు. రైతుకు వ్యవసాయం గిట్టుబాటు కాని దుర్మార్గపు రోజులు దాపురించాయి. ఫలితంగా అప్పుల పాలవుతున్నారు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నం అయిపోయింది. నీటిపారుదల రంగం నిర్లక్ష్యానికి గురై కునారిల్లుతోంది.

వ్యవసాయం, నీటిపారుదల రంగాలలో మౌలికమైన మార్పులు తెచ్చి రైతును ఆదుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. పంట దిగుబడిని పెంచాలి. వ్యవసాయం లాభదాయకంగా ఉండేవిధంగా చర్యలు తీసుకున్నప్పుడే గ్రామసీమలు కళకళలాడుతుంటాయి. పట్టణాలకు వలస తగ్గుతుంది. ఈ లక్ష్యాల సాధనకు కాంగ్రెస్ ప్రభుత్వం తీసుకునే చర్యలలో ముఖ్యమైనవి ఇవి:

1. రైతులకు ఉచిత విద్యుత్తు, విద్యుత్ బకాయిల మాఫీ, విద్యుత్ కనెక్షన్ల కోసం పెండింగ్‌లో ఉన్న దరఖాస్తులన్నిటినీ కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత వందరోజుల్లో పరిష్కారం. కొత్త దరఖాస్తులను 30రోజులలో పరిష్కరిస్తారు.
2. వ్యవసాయంలో ఆధునిక పద్ధతులనూ, యంత్రాలనూ ప్రవేశపెట్టడం. యంత్రాల నిర్వహణలో రైతుకు తగిన శిక్షణ ఇవ్వడం. వారి పనిముట్లను మెరుగుపరచడం. భూసార పరీక్షలు నిర్వహించడం. పంట మార్పులపై ఎప్పటికప్పుడు సరైన సలహాలు ఇవ్వడం.
3. మేలురకం విత్తనాలు, పురుగుమందులు సమకూర్చడానికి ప్రత్యేక చర్యలు తీసుకోవడం. కల్తీదారులను కఠినంగా శిక్షించడం.
4. రైతుకు గిట్టుబాటు ధర లభించేందుకు ఈ చర్యలు తీసుకోవడం.

అ) మార్కెట్ కమిటీల నిర్వాహకుల నియామకాలకు స్వస్తిచెప్పి రైతులే ఎన్నుకునే విధంగా చర్యలు తీసుకోవడం.

ఆ) పొగాకు బోర్డు తరహాలో పత్తి, మిరప, మామిడి బోర్డుల్ని ఏర్పాటుచేయడం.

ఇ) పత్తి కొనుగోలు పన్నును హేతుబద్ధంగా సవరించడం ద్వారా స్థానిక కొనుగోళ్ళను ప్రోత్సహించడం. పత్తి పంటను తాకట్టు పెట్టుకొని రుణాలు మంజూరు చేయవలసిందిగా బ్యాంకులను ఆదేశించడం, ఇందుకోసం ప్రత్యేకంగా కార్పస్‌ఫండ్‌ను ఏర్పాటుచేయడం.

ఈ) వరిధాన్యం రవాణాపై ఆంక్షలు తొలగించడం.

ఉ) స్థానిక ధరల నిర్ణయ కమిటీల ఏర్పాటు, ధరలను నిర్ణయించడంలో కుటుంబ శ్రమనూ, భూసారం తరుగుదలనూ పరిగణనలోకి తీసుకోవడం.

5. సింగిల్ విండో ద్వారా రైతులకు పట్టాదారు పాస్ పుస్తకాలపై ఆధారపడి రుణాలు ఇవ్వడం. సకాలంలో అప్పు తీర్చినట్లయితే వడ్డీలో రాయితీల్లో ఇవ్వడం. పైరు స్వభావాన్నీ,

అవసరాన్నీ గుర్తించి తగినంతగా రుణం మొత్తాన్ని పెంచడం.

6. పశువులు, పంటలపై సమగ్ర భీమా సదుపాయం కల్పించడం.
7. పశువులలో కృత్రిమ గర్భోత్పత్తి కార్యక్రమాన్ని ముమ్మరంగా అమలుచేయడం.
8. రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో పండ్లతోటలను పెంచడానికీ, మెట్టసాగును అభివృద్ధి చేయడానికీ ప్రత్యేక కృషి. బంజరు భూములను సాగులోకి తీసుకొని వచ్చేందుకు ఒక ప్రత్యేక బోర్డును నెలకొల్పడం.
9. నీటివనరుల సమర్థ వినియోగానికి నీటిపారుదలలో నవీన పద్ధతుల్ని ప్రవేశపెట్టడం.
10. నీటిపారుదల సౌకర్యాన్ని రెట్టింపు చేయడం. మెట్ట ప్రాంతాలలో చిన్నతరహా నీటివనరుల అభివృద్ధిపై ప్రత్యేక దృష్టి.
11. తాగునీటి పథకాలతో సాగునీటి పథకాలు అనుసంధానం చేస్తూ సమగ్ర జల వినియోగం విధానం రూపొందించడం.

    కృష్ణా జలాలను హైదరాబాద్‌కు తరలించే కార్యక్రమానికి శ్రీకారం చుట్టడం. ఆ క్రమంలో దారిలో ఉన్న గ్రామాల ప్రజలకు సాగునీటితో పాటు తాగునీరు కూడా అందించడం.
12. గ్రామ పాలనాధికారుల (వి.ఏ.ఓ) పారితోషికం పెంచడం. వారి ఉద్యోగ పరిస్థితులను మెరుగుపరచడం ద్వారా గ్రామ పాలనాదక్షతను పెంపొందించడం. వి.ఏ.ఓ.లుగా వీలైనంతవరకూ వ్యవసాయ శాస్త్రంలో పట్టభద్రులైన వారిని నియమించడం.
13. పాల సహకార సంఘాలకూ, పాడి పరిశ్రమకూ తోడ్పాటును అందించడం. పౌల్ట్రీలకు సరఫరా చేసే విద్యుచ్ఛక్తి రేట్లలో రాయితీలు ఇవ్వడం.
14. గొర్రెల పెంపకాన్ని ప్రోత్సహించేందుకు రాష్ట్రస్థాయిలో సమాఖ్య ఏర్పాటుచేయడం. ఎన్.సి.డి.సి. చట్టాన్ని సవరించి నాబార్డు ద్వారా సత్వర ఆర్థిక సహాయం అందజేయడం.
15. రైతుల స్థానిక అవసరాల మేరకు పంజాబ్ తరహాలో మన రాష్ట్రంలో కూడా అన్ని సేవలనూ అందించే ప్రధాన కేంద్రాలు ఏర్పాటుచేయడం.
16. పారిశుధ్య, పర్యావరణ పరిస్థితులను పెంపొందించడం.

## గ్రామీణాభివృద్ధి

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను, గ్రామీణ పర్యావరణాన్ని కింది విధంగా మెరుగుపర్చడం జరుగుతుంది.

అ) ప్రతీ గ్రామానికి తారురోడ్లు వేయడం, పల్లెపల్లెకు బస్సు సర్వీసు.

ఆ) ప్రాథమిక ఆరోగ్య, విద్యాసౌకర్యాలు కల్పించడం.

ఇ) పారిశుధ్య, పర్యావరణ సౌకర్యాలు మెరుగుపర్చడం.

## పారిశ్రామిక విధానం

దేశంలోని మూడు అగ్ర రాష్ట్రాలలో ఒకటిగా కొన్నేళ్ళ క్రితం వరకు ఉన్న ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా దెబ్బతిని 13వ స్థానానికి పడిపోయింది. గత అయిదేళ్ళుగా రాష్ట్ర పారిశ్రామిక రంగానికి వచ్చిన పెట్టుబడులు బహు తక్కువ. బీమారు రాష్ట్రాలుగా పేరుమోసిన బీహార్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్ కన్నా దిగదుడుపుగా ఉంది ఆంధ్రప్రదేశ్ పని. ప్రభుత్వరంగంలో కానీ, ప్రైవేటు రంగంలో కానీ గత అయిదేళ్ళలో కొత్తగా వచ్చిన పెద్ద పరిశ్రమ ఏదీలేదు. పైగా విదేశీ పెట్టుబడులు గణనీయంగా పడిపోయాయి. ప్రభుత్వ అసమర్థత వల్ల ఆల్విన్, రిపబ్లిక్ ఫోర్జ్ లాంటి ప్రభుత్వరంగంలోని పెద్ద సంస్థలు మూతపడినాయి. వందలాది పరిశ్రమలు మూతపడటం వల్ల రాష్ట్ర ఆర్థికవ్యవస్థ దారుణంగా దెబ్బతిన్నది. నిరుద్యోగం ప్రబలింది. ఉన్న ఉద్యోగాలు పోయాయి. దేశవ్యాప్తంగా పరిశ్రమలలో 20శాతం ఖాయిలాపడుతుంటే రాష్ట్రంలో ఇది 27శాతం.

పరిశ్రమలు ఖాయిలాపడటానికి దారితీసే పరిస్థితులను అధ్యయనం చేసేందుకు ఉన్నతస్థాయి ప్రవీణుల కమిటీని నియమిస్తాం. ఈ కమిటీని సత్వరంగా సిఫార్సులు చేయవలసిందిగా కోరుతాం. వచ్చిన వెంటనే సిఫార్సులను అమలుజరుపుతాం.

ప్రభుత్వరంగంలోని పరిశ్రమలను ప్రైవేటుపరం చేయడం పేరుతో ప్రభుత్వ ఆస్తుల్ని ప్రైవేటు వ్యక్తులకు దోచిపెట్టే ప్రస్తుత ప్రభుత్వ విధానాన్ని కాంగ్రెస్ ప్రభుత్వం తిరస్కరిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు ఆస్తుల మార్కెట్ విలువ రూ.60వేల కోట్లు. ప్రభుత్వం చూపించిన లెక్కల ప్రకారం అది ఆరువేల కోట్లు. ప్రభుత్వ సంకుచిత దృష్టి, తప్పుడు విధానాల కారణంగా లాభాల బాటలో నడవవలసిన రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ సైతం కష్టాల ఊబిలో కూరుకుపోతున్నది.

రాష్ట్ర పారిశ్రామిక విధానంలో మౌలికమైన మార్పులు వెంటనే తీసుకురావలసిన అవసరం ఉంది. పారిశ్రామిక రంగానికి రాష్ట్రంలో పటిష్టమైన పునాది నిర్మించాలి. భారత ఔత్సాహిక పారిశ్రామికవేత్తల నుంచీ, విదేశీ పెట్టుబడులు పెట్టేవారినుంచీ నిధులు రావాలి.

ఆర్థికరంగంలో సరళీకృత విధానాలకు కాంగ్రెస్ పార్టీ కట్టుబడి ఉంటుంది. మానవతాదృష్టితో సంస్కరణలు అమలు చేయాలంటుంది.

ప్రభుత్వరంగ సంస్థల్ని ఎండగట్టకుండా నిధులు సమకూర్చి, ప్రోత్సహించి ప్రైవేటు సంస్థలతో పోటీపడేవిధంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తుంది. అంతేకానీ ప్రైవేటీకరించే ఉద్దేశంతో ప్రభుత్వరంగ సంస్థలను బలహీనపరచడం జరగదు. చిన్న పరిశ్రమలను ప్రోత్సహిస్తాం. మోటారు వాహనాల పరిశ్రమ, సామాజిక, సాంకేతిక పరిజ్ఞానం, సాఫ్ట్‌వేర్ వంటి కొత్త రంగాలలో అభివృద్ధి సాధించడానికి అవసరమైన చర్యలన్నీ తీసుకుంటాం. ఇందుకై ఒక సమీకృత మౌలిక సదుపాయాల అనుసంధాన సంస్థను నెలకొల్పడం జరుగుతుంది. వ్యవసాయాధారంగా జీవిస్తున్న ప్రజల దృష్టిని పారిశ్రామిక ప్రగతివైపు మళ్ళించేందుకు ప్రత్యేక కృషి జరుగుతుంది.

**విద్యుత్ విధానం**

ఏ రకంగా చూసినా రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి పరిస్థితి ఆశాజనకంగా లేదు. నష్టాలలో నడుస్తున్న రాష్ట్ర విద్యున్మండలిని చీల్చి 'జెన్‌కో' 'ట్రాన్స్‌కో' అనే పేర్లతో రెండు కార్పొరేషన్లను నెలకొల్పారు. వాటికి సైతం నిధులు సమకూర్చుకోలేక పోయారు. పెట్టుబడులు తగ్గుతుండడంతో గత ఐదేళ్ళలోనూ రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ఆశించినంతగా పెరగలేదు. విద్యుత్ చౌర్యం వల్ల, సరఫరాలో నష్టాల వల్ల ఉత్పత్తి అయిన విద్యుత్‌లో 30శాతం వృధా అవుతున్నది. ఈ రకమైన నష్టాల శాతంలో జాతీయ స్థాయిలో సగటు 18కాగా, అంతర్జాతీయ సగటు 8శాతం మాత్రమే. ఈ రకంగా చూస్తే ఆంధ్రప్రదేశ్‌లో విద్యుత్ చౌర్యం, సరఫరాలో నష్టం చాలా ఎక్కువ. రాష్ట్రంలో 2005వ సంవత్సరం నాటికి విద్యుచ్ఛక్తి రంగంలో స్వయం సమృద్ధి సాధించేందుకు కాంగ్రెస్ ప్రభుత్వం తీసుకోదలచిన చర్యలు ఇవి:

1. పంపిణీని క్రమబద్ధం చేసి, పటిష్టమైన అజమాయిషీ యంత్రాంగాన్ని రూపొందించడం ద్వారా విద్యుత్ చౌర్యాన్ని అరికట్టడం.
2. పంపిణీ సరఫరాలలో నష్టాలను తగ్గించడం, ఈవిధంగా నష్టాల స్థాయిని జాతీయ సగటు అయిన 18శాతానికి తగ్గించడం.
3. పైవిధంగా ఆదా చేసిన విద్యుత్‌ను రైతులకు ఉచితంగా అందించడం.
4. ఇంతవరకూ జరిగిన కొనుగోళ్ళ ఒప్పందాలను సమీక్షించడం. ఇకమీదట ఇటువంటి వ్యవహారాలలో పారదర్శకత పాటించడం.
5. రాష్ట్రవిద్యుత్ బోర్డులో (జెన్‌కో, ట్రాన్స్‌కోలలో) నిర్వహించే కొనుగోళ్ళ వ్యవహారాన్ని క్రమబద్ధం చేసి అవి పొదుపుగా, పారదర్శకంగా ఉండేవిధంగా చేయడం.
6. స్థానిక సంస్థలకు విద్యుత్ పంపిణీ పని అప్పగించడం. తద్వారా పంపిణీని మెరుగుపరచడం, స్థానిక సంస్థలకు అదనపు వనరులు సమకూర్చడం.
7. సంప్రదాయేతర ఇంధన వనరుల్ని ప్రోత్సహించడం, ఇందులో సౌరశక్తినీ, వాయుశక్తినీ, వ్యర్థపదార్థాల నుంచి ఉత్పత్తి చేసే శక్తిని వినియోగించుకోవడం.

**విద్యావిధానం**

1. ఆపరేషన్ బ్లాక్‌బోర్డు పథకాన్ని విస్తృతంగా అమలు చేయడం.
2. 10వ తరగతి వరకూ అందరికీ ఉచిత విద్య.

3. గ్రామీణ ప్రాంతాలలో విద్యను నిరాటంకంగా కొనసాగించడానికి వీలుగా సమర్థులైన సిబ్బందితో ప్రతి ఐదు మండలాలకు ఒక్కటి చొప్పున గురుకుల పాఠశాల తరహా పాఠశాలను ఏర్పటు చేయడం.

4. సామాజిక ఆర్థిక వైజ్ఞానిక అవసరాలను దృష్టిలో పెట్టుకొని కొత్త విద్యా కోర్సులనూ, సంస్థలనూ ప్రారంభించడం, పాఠ్య ప్రణాళికలను మారుతున్న అవసరాలకు అనుగుణంగా పునర్నిర్మించడం.

5. రాష్ట్ర విశ్వవిద్యాలయాల్లో అమలులో ఉండే విద్యా కార్యక్రమాలనూ, నిర్వహణ పద్ధతుల్నీ సంస్కరించవలసిన ఆవశ్యకత ఉంది. విశ్వవిద్యాలయాల్లో స్వావలంబన సాధించేందుకు అవసరమైన స్వేచ్ఛనూ, స్వయం నిర్ణయాధికారాలనూ ఇవ్వడం. పటిష్టమైన పరిపాలన ద్వారా విశ్వవిద్యాలయాల పూర్వవైభవాన్ని, ప్రతిష్టను పునరుద్ధరించడం. విశ్వవిద్యాలయాల్లోని వివిధ సంఘాలు వృత్తి విశ్వాసాలనూ, ప్రమాణాలనూ పాటించేటట్లు రూపొందిస్తారు. విశ్వవిద్యాలయాలు, ఉన్నత విద్యాసంస్థల వనరుల సమీకరణ ప్రయత్నాలకు ప్రభుత్వం చేయూతనిస్తుంది.

ల్యాబ్ టు ల్యాండ్ (ప్రయోగశాల నుంచి వ్యవసాయ క్షేత్రానికి), యూనివర్సిటీ టు ఇండస్ట్రీ (విశ్వవిద్యాలయం నుండి పరిశ్రమకు) విధానాలను అమలుపరచడం ద్వారా విద్యకీ, ఆచరణకీ మధ్య ఉన్న అంతరాన్ని పూడ్చడం. విద్యా వ్యవస్థలో ఉన్న వాళ్ళందరికీ ప్రవర్తనా నియమావళి వర్తింపజేయడం.

**ఆరోగ్య విధానం**

కాంగ్రెస్ ప్రభుత్వం, ఆరోగ్య సంస్థల మౌలిక సదుపాయాలను పటిష్టం చెయ్యడానికి పూనుకుంటుంది. సంచారవైద్య కేంద్రాలను మరింత బలోపేతం చెయ్యడానికి చర్యలను తీసుకుంటుంది. సమాంతర వైద్య సేవల్ని క్రమబద్ధం చేసి, అవి మరింత సార్థకమయ్యేటట్లు

చూస్తుంది. గ్రామీణ ఆరోగ్య కేంద్రాల నిర్వహణా, పర్యవేక్షణా స్థానిక సంస్థలకు అప్పగించాలన్నది సంకల్పం.

ప్రైవేట్ రంగంలోనూ, ప్రభుత్వ రంగంలోనూ ఉండే సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రుల సేవలను పేదలకు అందుబాటులోకి తేవడం, జిల్లా కేంద్ర ఆస్పత్రులను సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులుగా అభివృద్ధి చేయడం.

అన్ని ఆసుపత్రులకూ ఆస్పత్రి కమిటీలను ఏర్పాటుచేయడం, జిల్లా పరిషత్తులకు ఎన్నికైన అభ్యర్థుల నుంచీ ఈ కమిటీలకు సభ్యుల్ని నియమించడం.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో విధిగా డాక్టర్లను నియమించడం, మందుల కొనుగోళ్ళకు నిధుల కేటాయింపులు పెంచడం.

మహిళా, శిశు సంక్షేమానికి ప్రత్యేక చర్యలు చేపట్టడం.

ప్రజలలో ఆరోగ్యం పట్ల మరింత అవగాహన, ఆసక్తి పెంచడం.

ప్రతి పెద్ద గ్రామంలో పెద్దలు వ్యాయామం చేయడానికి, పిల్లలు ఆడుకోవడానికి వీలుగా పార్కులు నిర్మించడం.

## శ్రామిక విధానం, ఉద్యోగ విధానం

శ్రామిక భాగస్వామ్యం మీద ప్రభుత్వం దృష్టి నిమగ్నం చేస్తుంది.

వైద్యబీమా విషయంలో ఇ.ఎస్.ఐ. మాత్రమే కాకుండా వైద్య బీమా సదుపాయం ఉన్న ఏ ఉద్యోగ సంస్థ పథకంలోనైనా ఉద్యోగులు చేరే అవకాశాన్ని పరిశీలిస్తాం. సరైన శాసనాల ద్వారా ఆసుపత్రులు, హోటళ్ళు లాంటి సేవారంగాల్లో కనీస వేతనాలు అందేటట్లు ప్రభుత్వం దృఢమైన చర్యలు తీసుకుంటుంది.

పారిశ్రామిక కార్మికులతో సమంగా వ్యవసాయ కూలీలకు కూడా సాంఘిక భద్రతా సౌకర్యాలు, ఆరోగ్యహామీ, గృహవసతి, విద్యా సదుపాయాలు ఉండేట్లు ప్రభుత్వం చర్యలు తీసుకుంటుంది.

కాంగ్రెస్ ప్రభుత్వం నిరుద్యోగ పట్టభద్రులకు సాలీనా రూ.2500 చొప్పున రెండు సంవత్సరాల పాటు నిరుద్యోగభృతిని కల్పిస్తుంది.

ప్రభుత్వంలో ఎంతో కాలంగా భర్తీకాని షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల, వెనుకబడిన తరగతుల ఖాళీలను తక్షణమే భర్తీ చేస్తుంది. మిగిలిన అన్ని ఖాళీలను త్వరలో భర్తీ చేస్తుంది.

## రాజీవ్ యువజన వికాస్

ఈ పథకం క్రింద రూ.500కోట్లతో ప్రత్యేక నిధిని ఏర్పాటు చేసి యువజనుల స్వయం ఉపాధికోసం మార్జిన్ మనీగా వినియోగించడం.

## గృహవసతి

ఇల్లులేని ప్రతి పేద కుటుంబానికీ ఐదేళ్ళలోపున ఇల్లు నిర్మించడం, బలహీన వర్గాల గృహవసతి, ఇందుకోసం బడ్జెట్ కేటాయింపుల రెట్టింపు.

ఇంటి నిర్మాణ ఖర్చును రూ.17,500ల నుండి రూ.25,000కు పెంచడం.

పట్టణాల్లోని దిగువ మధ్యతరగతి కుటుంబాలకు ప్రభుత్వం గృహవసతి హామీ పథకం అమలు పరుస్తుంది. ఆందుకోసం కనీసం 20మంది ఒక బృందంగా ఏర్పడి అపార్ట్‌మెంట్ల నిర్మాణానికి ఆర్థికవనరులు సమకూర్చుకుని ముందుకొస్తే అవసరమైన ఇంటి స్థలాలను తగ్గింపు ధరలకు ప్రభుత్వం సమకూరుస్తుంది.

## మహిళలకు అధికారం

మహిళలకు అధికారం కల్పించడానికి కాంగ్రెస్ ప్రభుత్వం ఈ క్రింది చర్యలు తీసుకుంటుంది.

1. చట్టసభల్లో 33శాతం రిజర్వేషన్ శాసనం రూపొందించడం.
2. మధర్‌థెరిస్సా బాలికా సంక్షేమ పథకం: దారిద్ర్యరేఖకు దిగువన ఉండి ఇద్దరు లేదా ఒక్కరు సంతానం ఉన్న కుటుంబంలో ఒక బాలికకు పద్దెనిమిదో ఏట లక్ష రూపాయల వరకు ప్రభుత్వం పూచీతో ఉపాధికల్పన.
3. కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం గతంలో ప్రవేశపెట్టిన డ్వాక్రా కార్యక్రమాలను పటిష్టం చేయడానికి సకల చర్యలూ తీసుకుంటుంది.
4. ఎంపిక చేసిన ప్రాంతాల్లో, ఎంపిక చేసిన సంస్థల ద్వారా ప్రత్యేకంగా మహిళల కోసం రుణ సౌకర్యాలను (క్రెడిట్‌విండో) కల్పిస్తుంది.
5. మహిళల కోసం లక్ష టెలిఫోన్ బూత్‌లు.
6. చౌక దుకాణాల లైసెన్సులు 75శాతం మహిళలకే.
7. కొత్తరేషన్ దుకాణాలలో పదివేల దుకాణాలకు మహిళలకు ప్రాధాన్యం.
8. ఇంటి యజమానురాలి పేరున ఇళ్ళ స్థలాలు, రేషన్ కార్డులు ఇవ్వడం.
9. పిజి స్థాయి దాకా ఆడపిల్లలకు విద్య ఉచితం. అర్హులైన మహిళలకు వృత్తి విద్యాసంస్థలలో ట్యూషన్ ఫీజు రద్దు.

అన్ని ముఖ్యమైన పట్టణాల్లో మహిళలకు హాస్టలు వసతి కల్పించడం, ఆరంభంలో జిల్లా కేంద్రంలోనూ, ఆ తర్వాత దశల వారీగా ఇతర పట్టణాలకూ విస్తరించడం.

ప్రభుత్వ కార్యాలయాల్లో, ప్రభుత్వరంగ పరిశ్రమల్లో మహిళలకు ఉద్యోగాల్లో 33శాతం రిజర్వేషన్ ఖచ్చితంగా అమలుపరచడం.

కార్యాలయ నిర్వహణ, ఉద్యోగాలు, ఆఫీసు అసిస్టెంటు లాంటి ఉద్యోగాలలో ఎక్కువ శాతాన్ని మహిళలకే కేటాయించడం, దామాషాన 33శాతం రిజర్వేషన్‌కు పూచీ.

సరైన చర్యలు చేపట్టడం ద్వారా, అవసరమైతే శాసనాల ద్వారా కూడా మహిళల పట్ల అన్ని రకాల అణచివేతల్ని అరికట్టడం, దగాపడిన మహిళలకు ఉచిత న్యాయం సహాయం అందివ్వడం.

తక్కువ ఆదాయ వర్గాల కుటుంబాల్లో మహిళల గొడ్డు చాకిరీని ఒక సమగ్ర పథకం 'ఇందిరాకళ్యాణ' ద్వారా కనీస స్థాయికి తగ్గించడం.

అ) గ్యాస్ పొయ్యిల ద్వారా పంట ఇళ్ళను ఆధునికం చెయ్యడం.

ఆ) అన్ని ఆవాస ప్రాంతాల్లోనూ రక్షిత తాగునీటి కల్పించడం.

ఇ) మరుగుదొడ్లు నిర్మించడం

తెల్లకార్డు ఉండే కుటుంబంలోని గర్భిణీ స్త్రీకి గర్భశిశు రక్షణ కోసం 6నెలల పాటు నెలకు వంద రూపాయల చొప్పున సహాయాన్ని అందించడం. ఈ సహాయం రెండు కాన్పులకే పరిమితం.

## సాంఘిక సంక్షేమం

సమాజంలో బలహీన వర్గాల సత్వరాభివృద్ధి సాధించడం ద్వారానే అసమానతలు తొలగించడం సాధ్యమని కాంగ్రెస్ పార్టీ దృఢవిశ్వాసం. అందుకే ఎస్.సి.లకూ, ఎన్.టి.లకూ, ఇతర వెనకబడిన వర్గాలకూ విద్యాసంస్థలలో, చట్టసభలలో, ఉద్యోగాలలో రిజర్వేషన్లను కాంగ్రెస్ ప్రభుత్వాలు ప్రారంభించాయి. ఈ దిశగా నిర్దేశించుకున్న లక్ష్యాలను సాధించేందుకు కాంగ్రెస్ ప్రభుత్వం కింది చర్యలు తీసుకుంటుంది:

1. భూములు లేని షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల కుటుంబాలలో ఒక్కొక్క కుటుంబానికి ఒక ఎకరం భూమి ఇవ్వడం.
2. ఎస్.సి., ఎస్.టి., బి.సి. విద్యార్థులకు తగిన కాలేజీ వసతి కల్పించడం. మెస్ ఛార్జీలను హేతుబద్ధంగా పెంచడం.
3. షెడ్యూల్డ్ తెగలవారి భాషకు లిపి రూపొందించడం.
4. లంబాడా తండాలలాంటి షెడ్యూల్డ్ తెగల ఆవాసాలలో 300లకు మించి జనాభా ఉంటే వాటిని గ్రామ పంచాయితీలుగా ప్రకటించడం.
5. షెడ్యూల్డ్ కులాలలోని వివిధ తరగతుల వారికి జనాభా ప్రాతిపదికపై తగువిధంగా ఆర్థిక సహాయం చేయడం.
6. బలహీన వర్గాల కాలనీలలో కమ్యూనిటీ హాల్ తరహాలో రాజీవ్‌భవన్‌లు నిర్మించడం.
7. సమీకృత గిరిజనాభివృద్ధి పథకాలను పటిష్టం చేసి, సేవలను మెరుగుపరచడం.
8. నిత్యం పెరిగే వెదురు, నిత్యం చిగుళ్లు తొడిగే బీడీలకు వంటి అటవీసంపద మీద పూర్తి హక్కులూ గిరిజనులకే ఇవ్వడం.
9. అర్హత ఉండే అన్ని కుటుంబాలకూ తెల్లకార్డులు ఇవ్వడం.
10. వృద్ధాప్య పింఛన్‌ను వంద రూపాయలకు పెంచడం. ఆ మొత్తాన్ని వృద్ధులకు వారి ఇంటిదగ్గరే చెల్లించడం.
11. మహిళలకూ, వ్యవసాయ కూలీలకూ బీమా సౌకర్యం కల్పించడం.
12. వృత్తి కోల్పోయిన నేతపనివారి కోసం ప్రత్యేక పథకాలు రూపొందించడం. వారికి పాస్‌బుక్కులు ఇవ్వడం. మరమగ్గాల రంగానికి అవసరమైన మౌలిక సదుపాయాలు కల్పిచడం.
13. స్వర్ణకారులకూ, రజకులకూ, క్షురకులకూ, సేవారంగంలో ఉన్న ఇతర వృత్తులవారికి గౌరవప్రదంగా జీవించడానికి అవసరమైన సంక్షేమ పథకాలను రూపొందించి, అమలుపరచడం.
14. వడ్డెరల ఉత్పాదకశక్తిని పెంపొందించే పనిముట్లు ఇవ్వడం.
15. ప్రమాదకరమైన వృత్తులలో ఉన్న గీత పనివారికీ, మత్స్యకారులకూ, గొర్రెకాపరులకూ, వడ్డెరలకూ, ఇతరులకూ సంబంధించి వారి కుటుంబాలకు లక్ష రూపాయలు అందేవిధంగా గ్రూప్ బీమా పథకాన్ని అమలుచేయడం.
16. గీత పనివారు చెల్లించవలసిన చెట్టు పన్ను తగ్గించడం. ప్రతి గ్రామంలో తాటి, ఈత చెట్ల పెంపకానికి కనీసం 5ఎకరాల ప్రభుత్వ స్థలాన్ని కేటాయించడం.
17. విద్య, ఉద్యోగాలకు సంబంధించి వెనుకబడిన తరగతుల జి.వో.ను మరో పది సంవత్సరాలు పొడిగించడం.

## అల్పసంఖ్యాక వర్గాలు

అల్పసంఖ్యాక వర్గాల అభ్యున్నతికి కాంగ్రెస్ పార్టీ మొదటి నుంచీ అగ్రతర ప్రాధాన్యం ఇచ్చింది.

ఈ దిశగా కింది చర్యలు తీసుకుంటుంది.

1. అల్పసంఖ్యాక వర్గాల వారికి రాజ్యాంగంలో పొందుపరచిన విధంగా మతం, విద్యకు సంబంధించిన హక్కులను పరిరక్షించడం.
2. ప్రభుత్వ ఉద్యోగాలలో తగినంత ప్రాతినిధ్యం కల్పించడం.
3. ఉర్దూ భాషను రెండవ అధికార భాషగా గుర్తించడం.
4. విద్యారంగంలోని అల్పసంఖ్యాక వర్గాల హక్కులకు సంబంధించి ఉన్న 1994 నాటి 30వ జీ.వో.నూ, 86వ జీ.వో.నూ అమలుపరచడం.
5. ముఖ్యమైన పట్టణాలలో షాదీఖానాలు నిర్మించి సమష్టి వసతి కల్పించడం.
6. మైనారిటీల కోసం రాజీవ్‌గాంధీ ప్రకటించిన 15 సూత్రాల కార్యక్రమాన్ని నిజాయితీగా అమలుచేయడం.
7. మైనారిటీ మహిళలలో విద్యావ్యాప్తికీ, ఉపాధికల్పనకూ ప్రత్యేక ప్రోత్సాహకాలు ఇవ్వడం.

○

# అసలు భయం ప్రజావ్యతిరేకతే!

- డి.పాపారావు

**పార్లమెంటు,** శాసనసభలకు ఒకేసారి ఎన్నికలు జరిగితే బాగుంటుందని ఉపప్రధాని, భారతీయ జనతా పార్టీ అగ్రనాయకుడు లాల్‌కృష్ణ అద్వాని ఇటీవల ఒక ప్రతిపాదన చేశారు. పార్లమెంటు, శాసనసభలకు వేర్వేరుగా ఎన్నికలు జరుపుతుండడం వలన పాలక పార్టీ నిరంతరం ఎన్నికల మూడ్‌లోనే ఉంటున్నదనీ, ఫలితంగా ప్రజా సంక్షేమం విస్మరించబడుతోందనీ, మంచి పాలనను అందించలేకపోతున్నదనీ ఆయన చెప్పారు. అలాగే పార్లమెంటు, శాసనసభలకు వేర్వేరుగా ఎన్నికల వలన ప్రతి నిర్ణయాన్ని ఆలోచించి చేయవలసి వస్తోంది, చివరకు బడ్జెట్ సైతం ప్రభావానికి గురవుతోందని ఆయన అన్నారు. ఇది క్లుప్తంగా అద్వాని చేసిన ప్రతిపాదనలో వున్న తర్కం.

అయితే ఈ తర్కం హేతుబద్ధమైనది కాదనీ, సాధారణ పరిశీలనలకు కూడా నిలబడజాలదని వైరుధ్య భరితమైనదని మనం ఇట్టే గమనించవచ్చు. వాస్తవానికి పాలకపక్షం గనుక ప్రజాహితాన్ని కోరి తన విధులను చిత్తశుద్ధితో నిర్వహిస్తుంటే అది ఎన్నికల గురించి ప్రత్యేకంగా ఆలోచించాల్సిన అవసరమేముంటుంది? ప్రజాహితాన్ని దృష్టిలో వుంచుకొని పనిచేసే ప్రభుత్వానికి మరలా పట్టం కట్టడానికి ప్రజలేమీ సందేహించరు. అయితే నేటి ప్రధాన పాలకపక్షాలు ఆర్థిక సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాల పేరిట దేశ ప్రజల ప్రయోజనాలను విస్మరిస్తున్నాయి. ప్రజా సంక్షేమాన్ని నిర్లక్ష్యం చేసిన పక్షాలే ఎన్నికల గురించి నిరంతరం ఆందోళనలో ఉంటున్నాయనడం సత్యదూరం కాదు. సంపన్నదేశాల ఎజెండాను మన దేశంలో నిరాఘాటంగా అనుసరించడంలో ఆ పాలక పక్షాలు నిర్ణీత వ్యవధిలో వచ్చే ప్రజాస్వామ్యయుత ఎన్నికలను కూడా ఆటంకంగా భావిస్తున్నాయి. ఫలితంగానే స్వయానా అద్వాని మహాశయుడే పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికలను వేర్వేరుగా నిర్వహించడం వలన ప్రభుత్వం ప్రతి నిర్ణయాన్ని ఆలోచించి చేయవలసి వస్తోందని చివరకు బడ్జెట్ సైతం ప్రభావానికి గురవుతోందనడం అంటే ఏ నిర్ణయాన్ని అయినా తాము ప్రజాహితం కోరి ఆలోచించి చేయడం మన పాలక పక్షానికి ఇష్టం లేదు. సంపన్న దేశాలకు అనుకూలురుగా స్వయంగా ఎటువంటి ఆలోచనలు లేకుండా పని చేయడం బహుశా పాలకపక్షానికి సులువేమోననే సందేహం ప్రజలకు రాకమానదు.

దీనంతటి సారం పాలకపక్షాలు సాధ్యమైనంతగా ఎన్నికల గురించి 'ఆందోళన' చెందకుండా తమ ప్రజావ్యతిరేక విధానాలను, బడ్జెట్‌లను రూపొందించుకుంటూ పోయే అవకాశాన్ని 'చట్టబద్ధంగా' కల్పించడమనేదే అద్వాని ప్రతిపాదనలోని అంతరార్థం. ఇక ఎన్నికలు తరచూ వస్తే ప్రభుత్వ ఖజానాపై భారం పెరుగుతోందనే వాదన ఒకటి ఉన్నది. ఇది కూడా సుదీర్ఘకాలంగా వినబడుతున్నదే. ఈ వాదన పచ్చి దగా. అధికార కైవసమే లక్ష్యంగా పెట్టుకొన్న రాజకీయవాదులకు నచ్చే వాదన. అందుకే వారు ఈ వాదనను ఎటువంటి మినహాయింపులు లేకుండా సమర్థిస్తుంటారు. వాస్తవానికి ఎన్నికల నిర్వహణకు ప్రభుత్వం చేసే వ్యయం కన్నా వివిధ పార్టీల అభ్యర్థులు (వామపక్షాల వారు కూడా ఇందుకు మినహాయింపు కాదని అంగీకరించక తప్పదు) తమ గెలుపుకోసం వెచ్చించే మొత్తం ఎన్నో రెట్లు ఎక్కువని అందరికీ తెలిసిన బహిరంగ రహస్యమే. అంటే మన 'వినాయకులు' దాచుకున్న నల్లధనం ప్రజాజీవన స్రవంతిలోకి వచ్చేది ఎన్నికలు జరిగినప్పుడే. ఎన్నికల 'పండగ' పలువురికి ఉపాధిని (పోస్టర్లు చేసే వాళ్ళు, పెయింటర్లు, కటౌట్లు చేసే వాళ్ళు, వాహనాలు కిరాకియి ఇచ్చే వాళ్ళు... ఇలా ఎందరికో) కల్పించే కుటీర పరిశ్రమ కూడా. కాబట్టి ప్రజల మీదా, ప్రభుత్వ ఖజానా మీద పడే అదనపు భారం గురించి పాపం పాలకపక్షాలు అనవసరంగా ఆందోళన చెందుతున్నాయి. సరే, ఈ ఎన్నికల విషయంలో మన రాజకీయ పక్షాలు తరచుగా వాడే ఈ ఫ్యాషనబుల్ మాట "ఇన్‌కంబెన్సీ ఫ్యాక్టరు". మొన్నీ మధ్య జరిగిన నాలుగు శాసనసభల ఎన్నికలలో తమ పరాజయానికి ఒక ప్రధాన కారణం ఈ ఇన్‌కంబెన్సీ ఫ్యాక్టరేనంటూ భారతీయ జనతా పార్టీ చేతులు దులుపుకుంది. ఈ మాటలకు అర్థం పాలకపక్షంగా వున్న పార్టీకి ఓటర్లు సాధారణంగా మళ్ళీ ఎన్నికలలో పట్టం కట్టరు అనేది. అంటే ఈ పాలకపక్షాల దృష్టిలో ప్రజలు సరదా కోసం, కొత్తదనం కోసం పాలక రాజకీయ పక్షాలను మార్చుతుంటారు! అయితే ఈ బహుచక్కని తర్కంలో పశ్చిమబెంగాల్, త్రిపురలలోని వామపక్ష సంఘటన ప్రభుత్వాల పరిపాలన ఎందుకు ఇమడదో మన పాలక వర్గాల నాయకులు వివరణ ఇవ్వగలగాలి.

పశ్చిమబెంగాల్‌లో వామపక్ష సంఘటన గత రెండున్నర దశాబ్దాలకు పైబడి అధికారంలో వున్నా ప్రజలకు దానితో ఎందుకు మొహం మొత్తలేదనేది ఇక్కడ కీలక ప్రశ్న. అలాగే 1947లో స్వాతంత్ర్యం లభించిన నాడు మొదలుకొని నాలుగు దశాబ్దాల పాటు కాంగ్రెస్ పార్టీ నిరాఘాటంగా పాలక పక్షంగా ఎలా కొనసాగగలిగింది? అపుడు పని చెయ్యని ఈ ఇన్‌కంబెన్సీ ఫ్యాక్టరు గత రెండు దశాబ్దాలుగా మాత్రమే

## పునరుక్తి

ఎందుకు మన రాజకీయ పదజాలంలో చోటు కల్పించుకోగలిగింది? వీటన్నింటికీ జవాబు మన దేశంలోని (ఆమాటకు వస్తే ఏ దేశంలోనైనా) సామాన్య ప్రజలకు ఎన్నికలు జీవన్మరణ సమస్యగా పరిణమించాయనే వాస్తవాన్ని గుర్తించడమే. తమ జీవితాలకు శ్రేయస్సును సమకూర్చే పాలకపక్షాలను తిరిగి ఎన్నుకోవడానికి ప్రజలు ఎపుడూ వెనకాడరు. వెనుకాడవలసిన అవసరం వారికేమిటి?

ఏ ప్రజాస్వామ్య సమాజంలోనైనా ఓటర్లు కేవలం కొత్తదనం కోసం ప్రభుత్వాన్ని మార్చరు. అలాగే తమకు అన్ని విధాల ఇక్కట్లను సృష్టించి, జీవితాన్ని నరకప్రాయం చేసే విధానాలను అనుసరిస్తోన్న పక్షాన్ని గద్దె దించేందుకు కూడా ప్రజలు ఎన్నికల 'పండగ'ను వినియోగించుకుంటారు. ఈ అర్థంతో చూస్తే మన దేశంలో ఆర్థిక విధానాలు ఎంతోకొంత మేరకు ప్రజామోదకంగా వున్నంత కాలం పాలకపక్షం సుస్థిరంగా, సుదీర్ఘకాలం పాటు అధికారం కొనసాగగలిగింది. కేంద్రంలో అయినా, రాష్ట్రాలలో అయినా, బెంగాల్‌వంటి రాష్ట్రంలో ప్రజాహితం కోరి పని చేస్తోన్న ప్రభుత్వాన్ని ప్రజలు పదేపదే ఆమోదిస్తున్నారు. ఈ విషయంలో కొంతమేరకు త్రిపురను కూడా చెప్పుకోవచ్చు.

కాగా, గత పదిహేనుళ్ళుగా మొదలైన ఆర్థిక సరళీకరణ విధానాలు మన దేశంలో బడుగు జీవుల జీవితాలను రోజు రోజుకూ మరింతగా కృంగదీస్తున్నాయి. ఈ కారణంగా సదరు విధానాలను అనుసరిస్తోన్న ఏ పాలకపక్షమూ పట్టుమని రెండు దఫాలు వరుసగా అధికారంలోకి రాలేకపోతున్నది. ఈ నేపథ్యంలో చూస్తే 'ఇన్‌కంబెన్సీ' ఫ్యాక్టర్ అనే ముసుగు తాలూకు మాటల గారడీని అర్థం చేసుకోగలం. కాగా పైన పేర్కొన్న సరళీకృత ఆర్థిక విధానాలు కుదిపేస్తున్న తమ అధికార పీఠాన్ని సుస్థిరంగా ఉంచుకోగలగడం నేటి మన పాలక పక్షాల ముందున్న సవాలు (అసలు వాటి లక్ష్యమూ అదేననుకోండి). సంపన్న దేశాలకు అనుకూలమైన విధానాలకు సుస్థిరతను కల్పించుకోగలగడం నేటి మన పాలకపక్షాలకు తప్పనిసరి. ఇది మన దేశంలో నిరాఘాటమైన సామ్రాజ్యవాద దోపిడీ తాలుకు అనివార్య అగత్యం. పైన పేర్కొన్న తర్కం తాలూకు కొనసాగింపే అద్వానీ ప్రతిపాదనల వెనుక వున్నసారం. ఇదంతా ప్రజాస్వామ్యయుత (అదెంత పరిమితమైనదైనా) నియంతృత్వాన్ని స్థాపించుకోగల పాలకవర్గాల ప్రయత్నంలో భాగమే. అంటే, తాము ప్రజావ్యతిరేక విధానాలను అనుసరిస్తూ తమ విధానాలను ప్రజల ముందు పదే పదే పరీక్షకు పెట్టుకోవాలని పాలకపక్షాల తాలూకు నిస్సహాయ స్థితి ప్రతిబింబమే అద్వానీ ప్రతిపాదన.

కాబట్టి మన దేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థ పరిమితులలో వుండే కాస్తంత ప్రజాస్వామ్యాన్ని అయినా కాపాడుకోగలిగేందుకై ప్రజాతంత్రవాదులు ముక్తకంఠంతో అద్వానీ ప్రతిపాదనను తిప్పికొట్టాలి. ఈ ప్రతిపాదన వెనుకవున్న దుష్ట తలంపును ప్రజల ముందు ఎండగట్టాలి. ●

---

### పాఠకులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు

*ఎన్ని ఆర్థిక సమస్యలు ఎదురైనప్పటికి వీక్షణం మొదటి సంవత్సరం పూర్తి చేసుకొని రెండవ సంవత్సరంలోకి విజయవంతంగా అడుగిడిందని తెలియజేయుటకు సంతోషిస్తున్నాము. ఇందుకు తోడ్పడిన పాఠకులకు, చందాదారులకు శ్రేయోభిలాషులకు కృతజ్ఞతలు. గత సంవత్సరం మొదటి నుండి చందాదారులైన పాఠకమిత్రులు కొందరు తమ చందా గడువు గత డిసెంబర్ మాసంతో ముగిసిపోయినప్పటికీ తమ చందాను పునరుద్ధరించుకోలేదు. వారు తమ చందాను పునరుద్ధరించుకొంటారని ఆశిస్తూ ప్రస్తుత జనవరి మొదటి, రెండు పక్షాలకు సంబంధించిన సంచికలను కూడా పంపిస్తున్నాము. ఈ సందర్భంగా వార్షిక చందాలను వెంటనే పంపిస్తారని తద్వారా తమ సహాయ సహకారాలను ఎప్పటివలెనే అందించగలరని ఆశిస్తున్నాం. చందాను పునరుద్ధరించుకోని పాఠక మిత్రులకు ఫిబ్రవరి మాసం నుండి వీక్షణం పత్రిక పంపించడం నిలిపివేయబడుతుందని తెలియజేస్తున్నందుకు అన్యథా భావించకూడదు.*

**- సంపాదకులు**

---

**వీక్షణం** చందాదారులు కాగోరువారు 'సమతా పబ్లికేషన్స్' పేర రూ. 140/-లను డి.డి.గా కింది అడ్రసుకు పంపించగలరు.

వి.హనుమంతరావు, ఇం.నెం. 8-3-898/22, రోడ్ నెం. 3, నాగార్జుననగర్, హైదరాబాద్ - 500 073.

Owned, Printed and Published by **V.Hanumantha Rao** at D.No. 8-3-898/22. Road No. 3, Nagarjuna Nagar, Hyderabad-500 073. Ph: 23748672
Designed & Printed at: Nutan Art Printers, Lakdi-ka-pool, Hyderabad. **Editor** : V.Hanumantha Rao